


# అభినవభారతము

అను షేక్స్పియరు మహాకవి బింబావళియందు

౧

## అథిలబింబము

మొదటిభాగము

---

మదరాసు హైకోర్టు వకీలు, బి. ఏ, బి. ఎల్.,

రెంటాల - వేంకట సుబ్బారాయ ప్రణీతము.

**Victoria Depot, Mylapore, Madras.**

**1920**





A. P. Press :—Madras.

# అవతారిక.

ఉ॥ పుట్టినపట్టు వీడి పరభూమినివాసము చేసి చేసి యీ *
పట్టున నింటికై మరలివచ్చు కుతూహలమంటి నీకుఁ
జే * పెట్టితి, నాంధ్రభారతీ! నవీనుఁడ నందు వఁటమ్మ
తల్లి! నేఁ * బెట్టు నుపారముల్ గొనుచు బిడ్డని పే
ర్మికి వేడ్కఁ జెందవే ?

మ॥ పదిరెం డేఁడుల ప్రాయమందు దయయొప్పన్ దాసు
శ్రీరామకో * విదుఁడున్ మద్గురుఁడై కవిత్వమునఁ దె
ల్పె న్నర్మముల్; వెన్కని * ర్వాదిదనాంగ్లము నభ్య
సించుచును నాంధ్రంబే మదిం బ్రీతిమైఁ * గుదురం
బద్దెము లల్లుచుంటి; విడితిన్ గుక్షింభరిత్వంబునన్.

క॥ మును గూర్చితి నాంగ్లో భా
షను విద్యార్థులకు మేలు సాయపు గ్రంథా
లను; నటఁ గమలాసత్రము
లను నఖిలాశ్లేష వ్యాఖ్యలను నుతిఁ గంటిన్.

క॥ చట్టములును హిందూ లా
దిట్టముగాఁ దెల్పినాఁడఁ దెనుఁగు జనుల; కే
పట్టున నా గ్రంథము క
న్పట్టును బల్లెలను బట్టనమ్ములయందున్.

# అవతారిక

కం॥ ఎందఱకు హాస్యలహరి ప
సందో, కేసరియు మర్మశాస్త్రముఁ గథలున్
విందో, యెందఱు మోదముఁ
గందురో యానందదీపికన్ సత్యవతిన్ !

సీ॥ గడియించినాఁడ లక్షలు మూఁడునాలు, గిం
కను గడింపఁగ శక్తి గల్గువాఁడ ;
నూఱులు వేలు సంతోషమ్ముతోడ స్నే
హితులకుఁ బేదల కిచ్చినాఁడ ;
శనిమహాదశ ప్రవేశము గాంచ సర్కారు
పత్రముల్ గొని నష్టపడిన వాఁడ ;
అసలువడ్డీ లిచ్చి విసువుచెందక ఋణ
పాతకమ్మునకు లోఁబడిన వాఁడ ;
తే॥ కష్టములు చుట్టుకొనియు లక్ష్యమ్ము గొనక
జోడు తేజీలు విడి, సతి సుతుఁడు సుతయుఁ
గఱువుగాఁగ విచార సాగరమునఁ బడి
బుడుత మన్నఁడె సుతుఁడుగాఁ బొంగువాఁడ.
తే॥ ఏఁబదొప్పె ; ముప్పదులు హాయిగను బాఱె ;
ఇరువదులు కష్టములు గని యెఱుక మీఱె ;
ఇంక నిరువదియుం దున్న దేఘనంబు ;
నాకుఁ దెలియును, బెఱలు గనంగవలయు.

తే॥ స్వీయచారిత్ర మందు విశేషమున్న
అద్భుతచరిత్రములు పెక్కు లమరియున్న
ఆత్మ చారిత్రము రచింప నల్పమగునె?
ఒక్క సత్ప్రభు చరితము నొప్పకున్నె?

చం॥ అని తలపోసి, పల్మరదియా యిదియా మఱియొకం
డయంచు నె * మ్మనమున నుయ్యేలందుబలె మంతన
మూఁపియు నిశ్చయించికొ౦ * టిని దలదాఁటు కా
ర్యము; గణింతునె ప్రస్తుత కష్టముల్ వినూ * తన
యతనమ్ముఁ దాఁకునని? ధైర్యము వీడ దదేమి చిత్ర
మో!

తే॥ కాళిదాసాది కవివరుల్ ఘనతఁ గనిరి;
వారి మీఱుచుఁ బ్రఖ్యాతి వడసె నౌర
కొన్నిటను మిన్నయైన యాంగ్లోకవీంద్రుఁ
డల్ల షేక్స్పీరు మహనీయుఁ డప్రతిముఁడు!

చం॥ అతఁడు రచించె ముప్పదియు నాలును రూపము
లాంగ్లభాష; భా * రతమునఁ జెల్లు నాటక విరాజి
తమౌ నల బింబవర్గ; మ * ద్భుతముగ జ్ఞానబోధ
నయబోధలఁ గూర్చుఁ; దెలుంగు బాసనౌ * చితిఁ
గను మార్పులొప్పఁగ రచించిన నెంతటి మేటిగ్రం
థమో!

మ॥ అథి, లాన్మేఘ, లయార్క, రమ్యక, తిమన్యాథీన, సీ
జర్, మహా * పథ, ప్రక్లేశక, సింహాలీనక, కళాపా
త్రా, త్రయోల్లాసక్ర * స్యథ, కర్యాలన సాఖ్యబిం
బకము లీరాజున్ విషాదాత్మక * ప్రథమంబుల్ ;
పఠన ప్రదర్శనములన్ బాటింపవే జ్ఞానమున్ ?

చం॥ ప్రళయ, ప్రతిక్రియా, వశిజ, భ్రాంతివివాహా, వి
వాహాభంగ, ధూ * ర్తలలన, కాముకాపజయ,
భ్రాంతివిలాస, సతీజయ, ప్రవా * సలలిత, మిత్రవం
చన, వసంత వినోద, పతివ్రతా, స్మరా * నల విఫలా
ఖ్యాతౌ పదియునాల్గు ముదావహ బింబ రత్నముల్.

కం॥ ఈరేను బింబకములాం
గ్లోరాజుల చరితములను గొన్నిటిఁ దెల్పున్
బోరుల వధల స్మీలుచు ;
నారయ నన్నియును ముప్పదార్బింబమ్ముల్.

---

TRAGEDIES — *Othello, Hamlet, Lear, Romeo and Juliet, Timon of Athens, Julius Cæsar, Macbeth, Pericles, Cymbeline, Antony and Cleopatra, Troilus and Cressida, Coriolanus.*
COMEDIES.—*The Tempest, Measure for Measure, The Merchant of Venice, Twelfth-Night, Much Ado about Nothing, The Taming of the Shrew, The Merry Wives of Windsor, The Comedy of Errors, All's Well That Ends Well, As You Like It, The Two Gentlemen of Verona, A Midsummer Night's Dream, The Winter's Tale, Love's Labour's Lost.*

తే॥ ఆంగ్లో భాషా మహారామమందుఁ గల్గు
గొప్ప లాంధ్రమ్మునకు సమకూర్పఁ గోరి
షేక్స్పియరు కవిఁ బలుమఱు చిత్తమందు
నిలిపితినిగాని మార్గమ్ము తెలియకుంటి.

ఉ॥ ఆశు కవీంద్ర సింహములె యాదురు కొప్పర సోద
రుల్ ; తదా * వేశప్రధాటి వెల్వడిన వృత్తసుభాష
ణముల్ వినంగ నా * యాశయమందు నాటకమయై
విలసిల్లె ; ననంతరంబు నా * కాశయుఁగల్గె షేక్స్పి
యరు నాగతి నాంధ్రమునందుఁ జేర్పఁగన్.

చం॥ చదువఁగలేదు సంస్కృతము,స్వల్పమయాంధ్రము
నందుఁ బాండితీ * పదవియు, నా కవిత్వము ప్రవాహ
ముకై వడిఁదేటమాటలం * బొదలునె యంచు సంశ
యము పుట్టియు నల్లితిఁ గొన్ని పద్యముల్ ; * కుది
రెను ధైర్యమా పయినిఁ గొందఱు మిత్రుల మెప్పఁ
బల్కులన్.

మ॥ గురజాడాన్వయుఁ డప్పరాయకవి ముఖ్యుండయ్యెఁ
బ్రోత్సాహము * న్నెఱపం,బ్రెగ్గడభానుమూర్తికవి
యున్మెచ్చెన్,నుతించెంబ్రభా*కరవిద్వాంసుఁడు;నం
దఱిట్లుఁపొగడంగానాకునాయంబెని*ద్దుర మేల్గాం
చి నృపాలుఁడైన కథయందున్ విన్న చందంబనన్?

సీ॥ అభినవ భారతం బద్భుతంబగుఁ గాక,
అది రచియింపఁగా నలవియగునె ?
అలవి యౌఁగాకది, యాంధ్రదేశమున శీ
ఘ్రమ్ము వ్యాపించు మార్గమ్ము కలదె ?
కలదు పోయదియు, రొక్కము వెచ్చ పెట్టఁగాఁ
గలుగు శక్తియు నాకుఁ గలుగుటెట్లు ?
కలుగుఁగా కదియు, సకాలమ్మునను దొడ్డ
లాభముంగల్గి మేల్గల్గుఁ గాక ;
తే॥ ఇన్నియుం గల్గుఁగాక, నా కెట్టులిట్టి
పెద్ద కార్యముఁ బూనఁగా వెరవు గల్గు ?
మెలిక చిక్కుల నూపిరి సలుపకున్న
నేఁ గయితయల్లుటెట్లు, రంజించుటెట్లు ?
తే॥ భోజరాజును బోలిన భూపుఁడున్నఁ
గాళిదాసునిఁ బోలు సత్కవియుఁ గల్గు ;
రాజరాజ నరేంద్రుండు ప్రభువయైన
నన్నయ తలెత్తఁడే, తిక్కనయు నిలువఁడె ?
కం॥ ఉత్కృష్టము నూతన మీ
సత్కృతిఁ దలపెట్టినాఁడ ; సంధిల్లదె భా
స్వత్కృష్ణాపాకము భగ
వత్కృప నిండారి యొక్క ప్రభు కృప గలుగన్ ?

ఉ॥ నూఱులు వేలు నిత్తు, రది న్యూనమయైనఁ బదార్థ
దుంగులో * ప్పారఁగ నిచ్చి పుత్తురు, కృపాతిశయ
మ్మున నగ్రహారముల్ * కోరక యే యొసంగుదురు
కొండొక వేళల, నాంధ్రరాజుల * య్యారె! వదా
న్యు; లిప్పు డకటా! యొకరిద్దఱ కానవత్తురే!

ఉ॥ కాలము మాఱిపోయినదొ? కందురొ యల్పమ
పెద్దయట్లు భూ* పాలురు నర్థమన్నను? నెపమ్ములు
వల్కుదు రొక్కొ-యీగిధా * రాళమవశ్యమౌనె
డఁ? దిరమ్మనియబ్బినకీర్తి కుబ్బియిం * కేలయటంచు
నెంతురొ? ఇసీ! యివి సత్ప్రభు లక్షణమ్ములే?

మ॥ పలుకాలింపరె యేనుఁ గెత్తువడినంబై కె త్తఁగా నేనుఁ
గే * వలె నంచుర్? నిజమయ్యె నాయెడల నవ్వా
క్యమ్ము; నన్గాంచి లో * కులు కొండాడుదు రేనుఁ గే
యనుచుఁ; జీకుల్పోవలెఁ గైయాంత నీ * వలంతుల్
గామికినంతగాంతురు — తలంపన్ జాలి రెట్టించెడిన్.

చం॥ నృపతుల కెంతపాటి యొకనిం బయి కెత్తుట? ఐన,
వారి స * త్కృప లభియించు టెట్లు? లభియించిన
నయ్యది ముఖ్యకార్యమై * యుపగతమౌట యెవ్వి
త? మదొప్పిన, మంతురు లడ్డుసెప్ప కో * రుపుగను
టెట్టు,లాపయిని రొక్కము మిక్కిలి యైన నెట్టులో?

చం॥ పొగడుట పెద్ద కాదు ; భువి భూషణ సల్పెడివారు
వేనవే * లు గలరు, పొల్లు బొల్లులఁ గడుంగడుఁ ద
న్పుచుఁ గార్యసాధన * మ్ము గనెడివారు ;— మెచ్చ
రొకొ భూపతులుం గలకీతిఁ బల్కి—నన్ ? బొగడని
కీర్తియే పొడుగుపోయని తెల్పిన సంతసింపరో ?

క॥ సామాన్యనరుల పోల్కిని
భూమీశుల నెన్ని మెచ్చఁ బోలునె ? విష్ణ్వం
శామలులు వారిపట్లన్
ధీమంతులు వంకలను గణింపందగునే ?

మ॥ కల కష్టమ్ములనెల్లఁ దీర్చి, నను సౌఖ్య మ్ముందఁగాఁ జే
యవే, * యిలరాయా ! యని కోరరాదు—తన హా
యిం గోరుకోమే లె? అ*న్యులు కైనంటఁగ లేని కా
ర్యముల నుద్యోగించి సాధించి లో * కులకున్ స్నేలోన
గూర్చు యత్నముననే కోరందగున్ సాయమున్.

చం॥ పదియును నూఱు వేయి నరపాలురకుం దృణమట్లు;
నన్నుఁ బోం * ట్లు దనియకున్నఁ గక్కుఱితిలోఁ
గొను వారల మెప్పదెంత ? అం * గద తవులంగఁ
గల్పకమ్ములై కయిసాఁచినఁ , బేరు సార్థమే * అద
నిది కా, దశక్య మిది, యాదరణీయమె, యల్పమే,
యనన్ ?

సీ॥ ప్రాణమ్ముతోడ సమానమ్ముగాఁ గందు
రమ్యమా నాదు హార్మ్యమ్ము పట్టు;
మహితమైలాపురీ మధ్యస్థ వరసరో
ధనపతిపార్శ్వ మధ్యస్థమదియు;
అతిరమణీయ, మాహ్లాదప్రదము, కన్ను
లకుఁ బండువైన స్థలంబ యద్ది;
కవితాసతికి కేవి గలిగించు తావు, ల
క్షుకు గడింపఁగ రాని స్థానమ యది;
తే॥ అట్టి పట్టున నైశ్చింత్య మబ్బె నేని,
బుద్ధి జిగిమీఱి యుద్దేశమునకు జయము
కల్గదే? అది యేప్రభు కరుణ నమరు?
ఆంధ్రజన సమాదరము ముఖ్యమ్ము కాదె?
తే॥ సంస్కృతమునుండి యాంధ్రభాష నిడినట్టి
నాటకమ్ములయందె భిన్నములు పుట్టెఁ;
గేవలం బన్యభాష యింగ్లీషునుండి
తెనుఁగునకుఁ దెచ్చు కార్యము తేలికగునె?
కం॥ భాషాంతరీకరణము స్వ
భాషం బలెఁ బరఁగుచో సెబాసని మెచ్చన్
భాషాసేవ యొసంగును;
భాషాంతకరణమ పొసఁగు వ్యత్యస్తము గాన్.

చం॥ తెలుఁగు నిటాలియన్ నుడియుఁ దేటలు, గానము
నందు మాధురిం * దలకొని యొప్పునందురుగదా?
— అటులౌటకు మూలమర్మముం * దెలియుదురో
క్కొ? అకృతము తెల్లమయ్యెనిఁ దెనుంగు నాటక
* మ్ములు రచియింతురో వచనముం గతిగా నిడి
మూఁడు పాళ్లకున్?

కం॥ ప్రాణస్వరవిస్తృతియె ప్ర
ధానమ్మగు గానమునకుఁ; దగవు హలంతా
లౌనుడుగులుఁ గఠినోక్తులు;
గానమజంత మృదుభాష గాదిలిఁ గోరున్.

సీ॥ భాషయందలి రసభావముల్ మదినంట
భరత గానమ్ము లావశ్యకములు;
పరఁగును గద్యము భరతము వలనఁ, బ
ద్యమెసంగు భరత గానములు రెంట;
భరతమ్మునందు లోపమ్మించు కేనియుఁ
బ్రాప్తింప గద్యమ్ము పసఁదొఱంగు;
భరతమ్ము లేకయుఁ బద్యభావరసమ్ము
స్పష్టమౌ గానలేశమ్ము గదియ;

తే॥ గణయతిప్రాసబద్ధ లక్షణముతోడ
గాన తంతువు గూర్చిన ప్రాణిమైన

పద్య మొప్పినయట్లు బింబమ్ము నందు
గద్యమొప్పదు తెలుఁగున; వేద్య మిదియు.

తే॥ హారమందున్న మణులు ముత్యాలపోల్కెఁ,
బ్రాణవాయువు గల్గు సుప్రతిమ భంగి,
గానతంతువు చేరికఁ గాంచినపుడు
పద్యమొప్పును; లేనిచోఁ, బల్కవలెనె?

తే॥ పద్యరూపకమైన బింబమ్ము నందుఁ
బాత్రముల భాషణమ్ములు పరఁగునట్టి
పద్యములు గానలవముచే భావములను
నెలయఁజేయుచు మది రస మొలయఁజేయు.

కం॥ ముందునకు సాఁగి, మఱి పిఱిఁ
దిం దన్నుచుఁ జదువునపుడు తేటఁ గననిచో
నందమ్ముగాదు, బింబము
నం దొప్పదు పద్యమెపుడు; వ్యర్థంబయగున్.

మ॥ భువి షేక్స్పీరును గాళిదాసు నిటలీపుత్రుండు దాం
తీయు నీ * రవతారమ్ములభేద మాత్ర మొకఁడే
యంచుం దలంతు న్మదిన్ * దివి నున్నావు, మహాత్మ!
షేక్స్పియర! యీ దేశస్థుఁడే నీదు బు * ద్ధి విశేష
మ్ములు తెల్పఁగా వలయుఁగాదే! నాహృదిన్ నిల్వవే!

———

# అభినవభారతము

౧.

# అథిలబింబము.

## నాటక పాత్రములు.

—:o:—

సూత్రధారుఁడు.

వెనిసుదేశపు రాజు.

ప్రబాధుఁడు — పెద్దమంత్రి.

మంత్రులు, రాజసభికులు.

గరస్యేనుఁడు — ప్రబాధుని యనుజుఁడు.

లాదవీకుఁడు — ప్రబాధుని బాధువు.

అథిలుఁడు — మూరుజాతి పురుషుఁడు, వెనిసురాజ్యపు సేనాధిపతి.

కాస్యుఁడు — యువసేనాని.

అయాగుఁడు — అథిలుని యనుచరుఁడు.

రుద్రగుఁడు — వెనిసుపురిలో నొక ఘనకుటుంబీకుఁడు.

మంతనుఁడు — సైప్రసుదీవిలో అథిలునకు పూర్వముండిన ప్రతినిధి.

నావికులు, వార్తికులు, రాజభటులు, సేవకులు, పాటకులు, పౌరులు.

దశదమూన — ప్రబంధుని కుమార్తె, అథిలుని భార్య.

యామిలి — అయాగుని భార్య.

బాణక — కాస్యుని లంజె.



# అధిల బింబము.

## ప్రస్తావన. *

—:౦:—

ప్రవేశము :—సూత్రధారుఁడు.

ద్వి॥ శ్రీరస్తు! విజయోస్తు! క్షేమాభివృద్ధి
కారణమస్తు! సత్కారుణ్యమస్తు!
ఘనులార! ధీవిచక్షణులార! వినుఁడు!
మును గలఁ డధిలుఁడన్ మూరుఁడు వీరుఁ;
డతఁ డిటలీదేశమందు రాజిల్లు
సతతభాగ్యప్రభాశ్రయము వెనీసు
పురవరమ్మున సైన్యమున నాయకుండు;
అరుదైన సత్కీర్తి నలరావువాఁడు;
వైరివర్గంబు గర్వమడంచి త్రుంచి,
ఘోరయుద్ధములు పెక్కుల్ సల్పి గెల్పు
గొని, క్రొత్తదేశముల్ గొని, కొల్చురాజ్య
మునకు దొడ్డయశమ్ము పొనరిచినాఁడు;

* నాటక ప్రదర్శనమునఁ బ్రస్తావన వదలివేయవచ్చును.

అల యాఫ్రికాదేశమందలి మూరు
కులమువాఁ, డతనిది గొప్ప వంగసము ;
మతము పెద్దలనాఁడె మాఱి క్రైస్తవము
హితమైన కతన నయ్యిటలిదేశమున
వెనిసురాజ్యమునఁ బ్రవేశమ్ముగాంచి
కొనినాఁడు కొల్వు ; బల్ గొప్ప కన్నాఁడు ;
ప్రవిమలవర్తన ప్రఖ్యాతివాఁడు ;
సవరని చామనచాయ గలాఁడు ;
తెల్లవారల ప్రణుతిని గెల్చినాఁడు ;
వల్లవాఁ డన్యుఁడు నాక వ్వపుంసు
ప్రేపదలు పెద్దలు విందులు గుడుప
నమ్మకంబైన సఖ్యము పెంచినాఁడు ;
ఈరాజు ముప్పదియేఁడుల బ్రహ్మ
చారి, నిర్మలుఁడు, స్వేచ్ఛావృత్తి తనకు
నలవాటుపడి వివాహంబు నొల్లండు ;
నిలిచి నాఁ డతఁడు వెనిస్ పురమంద,
పదినెల లెచ్చోట బవరముల్ లేక
అదను గల్గిన సిద్ధమై బయల్ వెడలఁ ;
గాంచినాఁ డచట నెక్కుగుణాలవాల,
నించు విల్తునికోల, మృదుశీల, గోలఁ ;

జంచలించె మనమ్ము, జనియించెఁ గోర్కి–
యించుఁబోణిని దన యిల్లాలిఁ జేయ ;
శక్యమే యిదియు, నశక్యమే చాక
చక్యమ్ముగల ధైర్యశాలికి నెదియు ?

* * *

ఎవ్వర్తు వింటిరే యీ పైఁడి ముద్ద ?
అవ్వెనీసు పురంబు నధిపుని పెద్ద
మంతుబిడ్డ ; దశదమూన నామంబు ;
ఇంతుల మేల్బంతి, యిమ్ముల దొంతి ;
పదునెన్మిదేండ్ల జవ్వని యల్లబోణి,
చదువులరాణి, యజ్జరె ! పాట వాణి ;
పదునొకండేఁడుల పాయమ్ము నాఁడె
కొదవయయ్యెను దల్లి ; కూఁతురె తల్లి
నై వృద్ధుఁడైన యయ్యకు సేవలందు
ఆ వృద్ధుఁడును బిడ్డ కమ్మయై కరుణఁ,
దనయలుఁ దనయులుఁ దక్కు–వ యాటఁ
దనరి రొండొరుల కాధారులై చెలఁగి ;
తనుఁ బెండ్లియాడ నెందఱో రాచకొమరు–
లును రూప మొప్పు మేల్పుట్టువుఁబట్టు

లెంత వేఁడిన వరియింపదు కన్నె ;
స్వాంతమునందుఁ దాఁ జదివిన కథలఁ
గలవారిఁ దలఁచి లెక్కఁకుఁ గొన దెవనిఁ ;
దెలుపదు మదిలోని తెఱఁ గెవ్వరికిని ;
దన కోకించుక మోజు తప్పులుచోఁ దండ్రి
కని — అమ్మరో ! యితగాఁడు వట్టి పయి
మెఱుపులవాఁడు చుమ్మి, రవంత యేని
తెలుకువ గనఁడు, కొద్దియ నిర్వరమ్ము—
నని తెల్ప, నలుగక యాతని మఱచు ;
జనకున కిష్టుఁడు, చక్కనివాఁడు,
గుణశాలియగు బంధుగుని మెచ్చ లేదు ;
పణఁతికి నెచ్చోట వరుఁడు కలండో
యని పల్కఁ, దా వివాహమె తలపోయ
నని తెల్పు, నయ్యఁ బాయఁగఁ జాల ననుచు.

*   *   *

కనఁగన లోకంబు కడుఁ జిత్ర ; మట్టి
కనకాంగి నధిలుండు గాంచి మోహమునఁ
దవిలి యెట్టెట్లొ హితమ్ము బోధించి,
అవమాన మనక యయ్యా నెఱుంగ నీక

అద్దమరేయి గృహమ్మున నుండి
సద్దు సేయక గొనిసని పెండ్లియయ్యె;
అయ్యోఁబో! యద్దాన నావంత యేని
నయ్యెర్వురకు శుభంబయ్యెనే? అయ్యొ!
అయ్యయో! యేనిప్పుడది చెప్పనేల?
దయ్యము నడ్డంగఁ దరమె యెవ్వరికి?
కల్యాణమైన యా గడియలోపలనె
తుల్యంబు లేని శత్రుభయంబువలన
సైప్రస్సులంక రక్షణ సేయు పనికి
సై ప్రయాణముగల్గి యఖిలుండు యాత్ర
వెడలంగవలసె; నా పెయుము మర్నాఁడు
వెడలె; దంపతులు దీనినిఁగూడి; రంత
నెల దినమ్ములుసెల్లెనే? అమ్మచెల్ల!
చెలువపై నరగలి సెంపి యా మగఁడు
రగులుచు భీకరప్రళయాగ్ని భంగి
భగభగజ్వాలలు ప్రసరించి లోక
మును మ్రింగు నార్భటమున రవళించి
దనుదాన మ్రింగుచుఁ దలక్రిందు లగుచు,
నిబ్బద్ది తెలియఁగా నేరక యొక్క—
దెబ్బలో వనితను దెగటార్చి, తనదు

దుడుకు బయల్పడ దుఃఖవారిధిని
బడి మునుంగుచు దిశల్ బ్రద్దలుగాఁగ
రోదనధ్వానమ్ము రువ్వి, రోసమునఁ
దాఁ దగ్ దునుముకొన్న తనుకు నాతరమె
నుడువంగ ? — మీరు కన్నులఁ గనవలయు.
జడదారికిని మది జాలి పుట్టించు
నక్కథ సకలలోకాభినుతమ్ము :
అక్కటికి మనంత ; మారట మక్క
జమ్మయి బడబాగ్ని చందము తనరు ;
బొమ్మ రక్కసి క్రిక్కు-బూమియల్ బయలు
వడుచు సుజ్ఞానమ్ము వర్ధిలం జేయు :
ఆడరు సునీతి, సఖ్యము పెంపుఁగాంచు ;
నుడువఁగా రాదు, కన్నులఁ జూడవలయు.

* * *

పడఁతి యేరీతి నబ్బకు డాఁగురించి
చులువెడలఁగ నొప్పె, నే విధ మధిలుఁ
దలఘువర్తనుఁడు నయ్యది సమ్మతించె,
ఈ సందియము జనియించు మీ కల్ల
యూహాకించుక తెల్పు టొప్పును గాదె ?

అఖిలు ననుచరుం డయాఁగుఁ డీ తంతు
పథమెఱుంగుచుఁ దన వనిత మూలమున
నడపె. ఆనాఁటి చిన్నతనమ్మునుండి
పడఁతికిఁ దోడుగాఁ బరఁగుచు సేవ
సల్పుచు నిపుడిప్డె సనియె నాలుగుచు —
అల్పమె యాపె సాయ మయాఁగునకును ?
పరమ దుర్మార్గుఁ డీ పాపాత్ముఁ డెందుఁ
జొరఁబడు నందు సంక్షోభంబు గల్గు
టరుదె ? ఆతని కదె యన్నంబు కాదె ?
ఎఱిఁగె నింతకుమున్న యీ పాతకుండు
కొమరుం డొకఁడు పెద్ద కొలమున వాఁడు
భ్రమగొంట యా మంత్రి పట్టిపై, నాకె
ప్రియము సూపించి తండ్రి యనాదరమున
జయము నలంగి యాసలు భంగపడఁగ ;
వక్కాణ మేల ? ఆ వరుని దాఁ జేతఁ
జిక్కించికొని కార్యసిద్ధికై యతని
రొక్కముల్ సొమ్ములా ద్రోహి తెప్పించి
మెక్కుచు నింకను మెక్కంగఁ గనఁడె ?

* * *

పెద్దమంత్రిరి యింటి విందుల కఱగి,
తద్దయుఁ బ్రీతిమైఁ దన యుదంతమ్ము
తెల్పి కొమార్తె మదిని జాలిఁ గొల్పి
కొల్పి, యయ్యథిలుండు కోర్కె-ఱింగింప,
మనము నర్పించి యా మగువ వేఁడికొనె :—
పెనుపకుమయ్య యీపిచ్చి సంకల్ప,
మియ్యది నెఱవేఱ దే నెఱుఁగుదున ;
అయ్యయు బందుగులం దెవ్వ రిట్టి
నెయ్యము కలనే గణింపరు సుమ్ము ;
వెయ్యేల ? మనకోర్కె వెతకు మూలమ్ము ;
మనమున నిల్పక మఱవుమా, సుహృద ! —
అని తెల్పి యాసకు నంతము సూపె.
అథిలుండు తన వాంఛ నటు వీడఁగలఁడె ?
రథమునుబలె మనోరథమును నడప
సారథియున్న నే సాధ్యమౌనంచు
నారసి యతఁడు హృదాశ్లిష్టమైన
నవయఃతన మ్మధీనమ్ము గావించె
యువనాయకునకుఁ గాస్యుఁడను మిత్రునకు.
ఈ రాయబారమ్ము నీతండు నాల్గు
సారులు నడపియు, సతి యొల్లదయ్యె ;

ఎట్ట కేలకు నాతఁ డెఱిఁగించె మూరు
పుట్టువు వంగడమును గొప్పయనుచుఁ,
దనపయి ప్రాణమంతయు నిల్పినట్టి
జనకుఁ డొల్లండని సంశయించుటయుఁ
దప్పటంచును. కొంత తడవు యోజించి,
యప్పువుఁబోణియు ననుమతి యొసఁగెఁ,
దండిరి కథిలుండు తనకోర్కెఁ దెలిపి
పెండిలి కతని యభిమతమ్ము గొనఁగ.

*  *  *

ఈ ఋజుమార్గమునే యంటి సనిన
నేరీతి ఫలితమో యెన్నంగనేల ?
ఘన మల్పమని మనోగతిఁ దోఁచఁగలదె
పెనుగామ తన చెంత వేఁచియుండంగ ?
కలసె ని త్తఱి నయాగపిశాచ మఖిలుఁ,
బలికెఁ బ్రియము నయభయములు దోఁప :—
జనకున కెఱిఁగించి సమ్మతి వేఁడ
మన ప్రయత్నంబెల్ల మలఁగియుఁ జెడును ;
అయ్య యొప్పిననేమి, యనుజుండు చుట్ట
లియ్యకొనరు ; వార లీకొన్నఁ గూడ,

సతిఁ గోరికోరి యాశలు వ్యర్థమైన
హితవరు లిప్పు డహితవరు లగుచు
కార్యభంగము సేయఁ గడఁగుట నిజము ;
ధైర్య మొప్పఁగ మును దరుణిఁ బెండ్లాడి
పదపడి తెల్ప నబ్బియు నెల్లవారు
మెదలకయుందు ; రీ మెలఁకువ గనుఁడు ;
గుట్టు తప్పనుచు సంకోచింపవలదు,
రెట్టించుఁ బెండిలి ప్రియము నయ్యాదియుఁ ;
గాన, నా తెల్పు సూక్ష్మమెఱింగి దశద
మాన నెక్లేని సమ్మతిలంగఁ జేసి
చాటునఁ గేల్పట్టు సల్పుట మేలు ;
నీటుగా నంతయు నెఱవేఱఁగలదు,
నానాతి యామిలి నయమొనగూర్పఁ
గానోపు నిట, నాయకా ! — యని పలికె.

* * *

పడఁతి యామిలి రాయ భారమువలనఁ
బొడమదయ్యెను ఫలమ్ము రవంత యేని ;
ఎంత వేఁడినఁగాని యీ చాటుఁబెండ్లి
యింతి, ససేమి! యే నీకొన ననియె ;

తండిరి కాదయుఁ దలవంపుఁ దెచ్చు
దుండగమున కేను దోడ్పడ ననియె ;
అంతలో, నైప్రసున్నం దాల మొలయు
చింత వాటిలి యాత్ర సిద్ధమై తనరఁ
దన వివాహమునకుఁ దరుణమ్ము కాదు,
జనకునకును దెల్పఁ జనదిష్డ, చాటుఁ
బెండిలి జతనమ్ము విడనాడు టొప్పి
యుండు నం, చఖిలుఁ డయ్యెబు సుజ్జగించె.

*　　　*　　　*

వ్యాజ్యమున్న నె న్యాయవాదుల బ్రదుకు,
భోజ్యమున్న నెకదా భూతమ్ము బ్రదుకు ?
అక్కజ మేటి, కయాగుఁ డయ్యఖిలు
ప్రక్కను జేరి యిప్పగిదిని బలికె :—
అయ్యయో ! యిది మంచి యదనయ్య, నాదు
తొయ్యలి నింకొకతూరి యంపించి
కనవయ్య ఫలము నీ ఘన యత్నమునకు
వినవయ్య నా మనవిని సాదరముగ —
అని తన కోమలి నాయిత్తపఱచి
వనిత దశదమాన నద్దికిఁ బంచె.

యామిలియును భర్త యక్క—అతోడ
వేమఱు కలఁపిన విధమునఁ బలికె :—
విన్నావు గదవమ్మ, పెనుఁబోరు గల్గ
నున్నట్టివార్త! అయో! అథిలుండు
ముందటి యుత్సాహమున లేఁడు, యుద్ధ
మందికఁ దనకు జయమ్ము లేదనుచుఁ,
దనదు ప్రఖ్యాతికిఁ దన కొల్చుదేశ
మున గొప్పకును ముప్పు మూఁడున యనుచు,
అస్తమయమ్ము దాపై యున్నదనుచుఁ,
గస్తితోఁ బలుమాఱు గణియించు చుండు—
ననుడు, నివ్వెత మెట్టు లబ్బెనో యనుచు
వనజాక్షి యడిగె, నెవ్వగ మోము తనర.
అది చెప్పఁగా నేల? —యామిలి పలికె —
విదితమగా నథిలుని వీక్షించి నంత ;
అలవి మీఱిన వివాహపుఁజింతఁ దవిలి
తెలివిని మబ్బు చెందినవాఁ డతండు ;
నినుఁ బెండ్లియైన గణించునే పెద్ద
గను లోకము జయించు కార్యమ్ము నేని ?
తన కోర్కికిని ఫలితముగాన కతఁడు
మనము కోల్పడి తమోమయుఁ డయినాఁడు ;

తరుణము కా దియ్యదంతమ్ము తెల్పి
కరుణమై నాయన కైకోలు వేడఁ;
గానఁ బ్రకాశ వికాసమ్మొకించు
కేనిఁ గల్గక యతఁ డీ కయ్యమునకు
నేఁగువాఁ, డపజయ మెన్నువాఁ డకట!
ఏ గతినైన నీ మొనలేని ప్రేమ
మఱపురాదని మఱిమఱి వల్కి, జముని
పురమున కేఁగునప్పుడు గూడఁ దనదు
హృదయమ్ము నీనామమే ధ్వనియించి
మృదుగాన భాగ్యమ్ము మించి సుఖించు —
నని తెల్పి పీడుకో లడిగినాఁడమ్మ! —
ఘనుఁ డఖిలుం డెట్టి కడగండ్లు వడెనో!

* * *

వినుచుండ గుండియల్ వెసఁ గొట్టికొనియెఁ;
గనుచుండ నశ్రువుల్ కనులందుఁ గ్రమ్మెఁ;
దనపొంటె నఖిలుఁ డుత్తలపడవలసె
నని వగచునె కాని, యయ్యను మీఱి
నడవంగ నేర్చునే నాతి? ఇప్పటికిఁ
గడచినదే తప్పుగా నెన్నుచుండుఁ;

దల్లి లేని కొంత తవిలెను మదిని,
ఉల్లమెల్లను దండ్రి కొప్పించుటెట్లు ?
యామిలీ ! మునింగితి నంధకారమున !
ఏమియుం దోఁపదు ; యెఱుఁగఁగాఁ జాల
మేలు కీడులు ; మేర మీఱుచు నీక గు
బాలున దుమికి దైవము నమ్మఁదగునె ?
దిక్కుమాలిన పక్కి తెన్నున నిట్లు
చిక్కులలోఁ జిక్కి చింతిలవలసె —
నని గద్గదస్వర మలరంగఁ బల్కి
యును బల్కలేక పల్కుడిగెనునంత,
అక్షిద్వయము మొయిలై యశ్రుజలము
వక్షస్స్థలమ్మున వర్షింపఁ దొడఁగె.

* * *

అది గని యామిలి — అమ్మ ! నేఁజెల్ల !
ఇది యేమి వెఱ్ఱి ! యిసీ ! నాదు పుట్టు
విందుల కయ్యోనే ? యేఁజెల్ల ! ననుచు,
ఇందీవరాక్షి ముఖేందు బింబమ్ముఁ
గప్పిన చిఫురుఁగేల్ కడకుఁ గదల్చి
ముప్పొంగు ప్రేమమై ముద్దులు గొనియుఁ,

గన్నీరు తుడిచి యిక్కయివడిఁ బలికె :—
కన్నెరో ! యిట్టి దుఃఖము చెల్లునమ్మ !
అమ్మ ! మీ యమ్మ నిన్నప్పగించెఁగద
వమ్మ నాచేత ; నీ కాపదల్ దొడర
నిత్తునే, యీప్రాణమేని నీ కీనె ?
పొత్తుకానిని గొంటిపో యన కమ్మ ;
నీ కన్న మిన్నమానిసియే ? — యటంచు,
ఈ కన్నులాన నుమ్మీ ! — యని పల్కె.
ఇప్పల్కులింతి కమృతధారవోలె
నొప్పి మనఃక్లేశ మొక్కింత శాంతిఁ
గనియె. ఆయమ యమ్మ కలవైన వెనుకఁ
దనకు యామిలి ప్రేమ తక్క వేఱొక్క
తరుణి కృపానువిద్ధంబైన వాకు
నెఱుఁగని కతన నయ్యేలనాగ నిపుడు
కలవైన తల్లియకా మదినెంచి
గుఱి యేర్పడఁగఁ దనకొంకు తీర్పుమనె :—
యామిలీ ! నా తెల్వి యడు గంటియున్న,
దేమి సేయుదు ? దైవమే గతియంచు
దుడుకుఁగార్యము తలంతునె ? సేమ మగునె ?
నుడువుమా — యనియెఁ గన్నుల నీరు గ్రాల.

పలికె యామిలి బాల భయము తీఱంగ :—
వలదమ్మ వెఱ్ఱి! దీవస ముంచవమ్మ!
కనఁగలవమ్మ సౌఖ్యమ్ము, నామాట
వినుమిదొక్కటి; నాదు విభుఁడును నేను
నుంతయే నావడిఁ జొప్పడ నీము;
అంతయు గంటలో నైపోవు నమ్మ;
కయ్యమునుండి యాగమనమై నంత
జియ్యకియ్యది తెల్పి జేవెట్టి వేఁడఁ
దగును దీవన; యంత దనుకను మర్త
ముగ నుంచనగు — నని బోధింప, దాన
నశుభ మెవ్వారికి నత్తదె? — యనుచు
దశదమాన దిగులు తగిలి ప్రశ్నించె.
ఏ యెగ్గువాటిల, దిది నిశ్చయమ్ము;
నా యతండు నఖిలనాయకుం డిట్లు
తలఁచువారలు; తప్పిదము కాదు, దీన
సిలు గొలయద యని చెప్పిరి; కాన,
నోయమ్మ! యాతని యుసురు కాపాడ
నైయేని నీకొను, మైవచ్చు నమ్మ! —
యనవుడు, యామిలి నట్టె వీక్షించి
ననబోణి యడిగె నెన్నఁడు వేళ యనుచు.

తామసింపఁగరాదు, తల్లి! యీరాత్రి
యే మేలుగానుండు; హితమగు నిక్క
యరసి యేర్పఱిచెద మనతిదూరమున;
ఇరువురమును మనమేఁగి రానగును
గంటలోపలన; యిక్కడను నయాగుఁ
డొంటరి కావలియుండు దవ్వులను;
వింటివే యమ్మ యిప్పటికిను ? పండ్రెండు
గంటలు కొట్టిన క్షణము గమ్మున
నిలిచియుండును జుమ్ము; నీవు న త్తఱిని
దెలిసి యల్లల్లఁ గ్రిందికి దిగిరమ్ము —
నావుడు దశదమానయు వల్లె యనియె;
ఈనాకు తాఁబల్కు టెఱుఁగద యయ్యొ;
కీడుమేల్ దెలియుశ క్తి తలంగియుంట
పాడు దైవముపయి భారమ్ము నిలిపె.

* * *

ఆ నడిరేయి నయాగుఁ డచ్చోటఁ
దా నొప్పికొన్న పద్ధతిని వాకిటను
నిలిచి పారాయుంట నిజ మెన్ని నాఁడె ?
తిలకింపుఁ డాతఁ డే తెఱఁగునఁ దొంటి

వరుఁడు రుద్రగునికై పఱచియు నతనిఁ
బరుగునఁ దోడ్కొని వచ్చుచున్నాఁడో !
పరమ చండాలుఁడీ బ్రహ్మారాక్షసుని
ఎఱుఁగుట మేల్గాన, నీక్షించరయ్య !

---



# ప్రథమాంకము.

——:o:——

## రంగము ౧. — వెనిసు పట్టణము, ఒకవీథి.

ప్రవేశము :—రుద్రగుఁడు, అయాగుఁడు.

---

రుద్ర. తే॥ చాలు నీకమాటలుడుగుము, చాలుఁ జాలు;
ఔర ! నాధనమెల్ల నీయది గాఁ జూచి
కొనుచు, వెచ్చపెట్టుచు, అయాగుఁడ! దయావి
హీనమతి దాఁచితివిగద యీ విషయము !
ఇంక నీ పల్కులను నమ్ము టెట్టులయ్య ?

అయా. వల్ల కాదయ్య ! చెప్పినదెల్ల వినవు ;
స్వప్నమందైన నీరహస్యంబు నెఱిఁగి
యుంటి నేని నన్నిటు పయిఁ గంటగించు.

రుద్ర. అతనియెడ నీకు ద్వేషమ యుంటివిగద !

అయా. కానిచో, నన్ను ద్వేషించి కడకుఁ ద్రోయు
మయ్య. ఇపుడది త్రవ్వంగ నదనుగాదు ;
స్నేహితులకును జెప్పంగ సిగ్గువచ్చుదు.

మ॥ యువసేనాని పదంబునుం బడయఁగా యోగ్యుం
డనోకానొయే * ల వితర్కింపఁగ ? నాదు శక్తి
కిని మూల్యంబెన్నుకోఁ జాలనే ? * ముప్పదిప్ప
ట్టణ పౌరవర్యులభిరాముల్ నా నిమిత్తమ్ము చా
* ల వినమ్రత్వముఁ దాల్చి వాని బతిమాలన్
మేలు సేకూరెనే ?

శా॥ గర్విష్ఠుండు స్వకార్య నిర్వహణ దీక్షాదక్షుఁ డా
తండు యు * ద్ధోద్యోగార్చి ప్రగల్భ మర్త్యముల
నెంతో వింత చిత్తంబునన్ * బర్వంబల్కె, తు
దిన్, మదీయ యువసేనానిన్, భవద్దర్శనా *
త్పూర్వంబే నియమించుకొంటి ననుచుం బుత్తెం
చె మన్నితులన్.

ఉ॥ ఆయువనాయకుం డెవఁడొ యాతనికిం గలయట్టి
ప్రజ్ఞ యెం * దో యని వింటె ? కాన్యుఁడన నో
ప్పెడి మేల్ గణికుండు, పద్దులన్ * వ్రాయఁగ
లెక్కఁ గూర్పఁగల ప్రాజ్ఞుఁడు, రూపవతీ ప్రి
యుండు ; నా * ధీయుతుఁ డే సెలంగు రణాధిపుల
పైయధికారియై యుఁకన్.

సీ॥ రణరంగమున సేనలను గొని మెలఁగఁడు
వ్యూహముల్ పన్నెడి యుక్తి లేఁడు ;

గ్రంథములఁ బఠియింపఁగాఁ గల్గు జ్ఞానమే
　కాని స్వానుభవము లేనివాఁడు;
కీర్తిఁగాంచిన రాజకీయ సభ్యుల భంగి
　వాగ్వివాదంబుల వరలువాఁడు;
ఒప్పారు పల్కుల మెప్పు దర్పము కాని
　కార్యసాధనశక్తిఁ గనని వాఁడు;
తే॥ ఇట్టిఁడాయువ సేనాని; యితని నింకఁ
బెక్కుకదనరంగములందుఁ బేరుగన్న
యేను ననుబోంట్లుఁ బెద్దగ నెన్నవలయు!
కాలగతి యిట్టులున్నది గాదె చూడ!
కం॥ తనకనుల యెదుట, సైన్య
ప్రసన్న రోష్మన నింక నెన్నోచోట్ల ననిలోఁ
గొనకొని పోరిన ననుఁ దన
యనుచరునిఁగఁ జేసికొనియె నథలుండకటా!
సుద్ర. తే॥ దైవసాక్షిగఁ బల్కెదు దానికన్న
నథలు తలవరినాట కే ననుమతింతు.
అయా. అలుకఁ గన్న ఫలమ్ము లేదన్న! వినుము;
సేవయందుఁ గలట్టి విశేష మిదియు.
కం॥ ఇచ్చకము, ప్రాపు, విహితుల
మెచ్చులు సేవకుల కెపుడు మేల్ పదవిం దా

మిచ్చును ; సామర్థ్యంబే
తెచ్చునె? అఖిలుదెస నాకు ద్వేషము తప్పే ?

రుద్ర. తే॥ అప్పు డాతనివెంట నే ననుచరుండ
నగుచుఁ బోనోప.

అయా. అది వట్టి మొఱకు తనము ;
వానివెంబడి నంటి నాపగను దీర్చి
కొందునని నమ్ము ; నా కది వింపుసుమ్ము.

కం॥ పొసఁగునె యజమానులు గా
నెసఁగఁగ నెల్లరకు భువిని? భృత్యులకు సమం
జస బుద్ధియు విశ్వాసం
బెసఁగంగా నగునె పతులయెడ నెల్లెడలన్ ?

మ॥ ఒడయండే భగవంతుఁడంచు మదిలో నూహిం
చి, తత్సేవలోఁ * గడు నైచ్యంబున కేనిఁ బా
ల్పడుచు, సౌఖ్యంబేది, వాఁడిచ్చుగి * ద్దెఁడునూ
కల్ పరమప్రసాదమని తృప్తింగాంచు, వార్ధక్య
మున్ * బడయం ద్రోపుడుపొందు సేవకులు
శ్వానంబుల్ ఖరంబుల్ గదా !

మ॥ పయికిన్ మెప్పుగ సేవఁజేయుచును, విశ్వాసమ్ము
తోఁపింప వా* ర్తయు వేషమ్మును దాల్చి, స్వాం
తమున నాత్మశ్రేయ మెల్లప్పుడా * రయుచున్

వీలున జేబునింపుకొనుచుఁ ద్రవ్యము సేకూర్చి
స్వే * చ్ఛ మెసంగం దనకొల్వ్యవీమనతనిఁ శ్లా
ఘింపఁగాఁ జెల్లదే ?

కం॥ ఈ తెలుఁగు సేవకుఁడఁ జు
మ్మీ; తలఁపకు వెడఁగననుచు; మెల్లగఁ బనిలోఁ
బ్రీతి నటించి స్వకార్యం
బే తీర్పఁగ నథలు వెంట నేఁగెడు వాఁడన్.

చం॥ మదిఁ గలయట్టి మాతనము మర్మము నొక్కకు
మత్ప్రియోక్తులన్ * విదితముసేయువర్తనము
నేర్తునె? నేర్చిననాఁటఁ గోలె నా * హృదయ
ము తాపుమాని వెలికెక్కి భుజమ్మునుండఁ జెల్ల
దే * పసుపురు నంటి చూడఁగను ? బాపురె !
మీకనువాఁడయాగుఁడే ?

రుద్ర. ఉ॥ ఎంతటి గొప్పభాగ్యము వహించునహా యల
మోటు మూరు బ * ల్వింతగ నిట్టు లింత యువ
లీల సతీమణి నందెనేని !

అయా. గ * ల్లంతున వాని
పెండ్లి విఫలం బొనరింపఁగ, నాపెయయ్యవి *
శ్రాంతి సెడంగ లేపియుఁ బురంబున నియ్యది
చాటఁగా నగున్.

కం॥ తండ్రినిఁ బందుగులను బె
క్కండ్ర ననిపి, వారి కనలు కార్చిచ్చులచేఁ
దీండ్రఁ గలిగించి యతనికి
మంత్రాటమెసంగ సుఖము మాపఁ గడఁగుమా.
సీ॥ పూఁ బాన్పుపైన నిమ్ముగఁ బండియుండంగఁ
గొల్లేటిదోమలు కుట్టినట్లు,
అమృత తుల్యంబగు నాహారమునఁ గుంచె
డుప్పుకేటి యిసుక గుప్పినట్లు,
పండువెన్నెల గాయుచుండ మబ్బులుగూడి
యిరులు గ్రమ్ముచు వాన గురిసినట్లు
నిశ్చల ధ్యానంబు నెగడఁగాఁగోరు భ
క్తులచుట్టు గంటలగోల యట్లు,
తే॥ పలుగతుల వేధఁ గల్పించి, ప్రబ్బపెంచి,
సంతసము కొంత డించి, విసమ్ము నించి,
అంతరించున యట్టు ప్రయత్నములను
విసువుఁగాంచక యింకఁ గావించు మయ్య.
రుద్ర. తే॥ అదిగొ అదె యాపెయబ్బగృహంబు, బొబ్బ
వెట్టి యఱచెద.
అయా. కానిమ్ము ; భీకరమగు
ధ్వని యెసంగఁగ, నర్థరాత్రమున నగ్గి

రగిలి నగరికి నాపద మిగిలి నట్లు.

రుద్ర. ఓ ప్రబంధ! ప్రబంధ! ఒహూో ప్రబంధ!

అయా. నిద్రలెమ్మా, ప్రబంధ! హాూ! నీ గృహమున
దొంగలయ్యా! లే! దొంగలు, దొంగలయ్యా!
కూఁతురిని, సంచులను జూచుకోఁగదయ్యా!

---

ప్రవేశము :—మేడపైఁ గిటికీయొద్ద ప్రబంధుఁడు.

---

ప్రబం. భీకరంబైనయట్టి యీ పిలుపునకును
గారణంబేమి? ఎవరది?

రుద్ర. కసరకయ్యా!
ఇంట నందఱు సున్నారె?

అయా. ఇంటి తలుపు
లన్ని బద్రమె?

ప్రబం. ఇట్లేల యడిగె దీవు?

అయా. శా॥ అయ్యా! దోఁపిడి యయ్యె నీదు గృహ; మయ్యా! నీహృదిఁ బేనవేల్ * ప్రయ్యల్ సేసిరి; అర్ధభాగమయి నీ ప్రాణమ్ములన్ ద్రుక్కె; న * య్యయ్యో! యిప్పుడ నీ కుమారికను నీ హంసం గళంకుండు మూర్ * శయ్యం జేరిచి క్రీడ సల్పెడినయో! జాగొప్పునే యిప్పుడున్?

తే॥ లెమ్ము! దిగిరమ్ము! పొరుల లేపి యిపుడ
మూరు కడకేఁగి నీదు కుమారిఁదెచ్చి
కొమ్ము; కాకున్న, రక్కసి కూనలకును
తాత వాదువు పొమ్ము; తథ్యమ్ము సుమ్ము.

ప్రబం. ఓరి! మతి చెడెనో నీకు?

రుద్ర. ఓ ప్రబంధ!
నన్నెఱుంగవె? గొంతు గుర్తెన్న లేవె?

ప్రబం. ఎవఁడ వీవు?

రుద్ర. రుద్రగుఁడనం చెఱుగుమయ్య.

ప్రబం. ఓరి పలుగాకి! నీ వఁటరో పిసాసి!

ఉ॥ నాయిలు చాయ రావలదు, నాదు ననుంగుఁగు
మారి నీకుఁ గా * దోయి యటంచుఁ జెప్పితిఁ
గదోరి మఱిక్కమఱి తేటమీాఱ! ఏ * లా యిటు
లీవు తప్పఁదిని లాహిరిసెందియు దుష్టబుద్ధి నా
* హాయి సెడంగ నార్చితివిరా? నిను దండన
సేయు టెంతరా?

రుద్ర. తే॥ శాంతము వహించు మోయయ్య!

ప్రబం. పహారర యిది.
నాగృహమ్మున దోఁపిడి సాగెనంటె,
పొలము పట్టున యిల్లని తలఁచితివిర?

రుద్ర. అయ్యా! పెద్దయ్యా! కల్లగా దరయనయ్యా !
అయా. అయ్యా! దయ్యము సెప్పినదనుచు నీవు
దైవమునకు మ్రొక్కఁగ లేని తార్కికుఁడవు!
నీవయిని నక్కటికఁ గాని నీకు మేలు
సేయవచ్చిన మస్సు బల్ చెట్ట లనుచుఁ
దలఁచి నీకూఁతు బర్బ్బరి తత్తడికిని
అప్పగింతువఁటయ్యా! వహవ్వారె! సకి
లించు మస్తల నింకఁ గడించఁ గలవు!
ప్రబం. పాడెగట్ట! యీ బూతులబాడఁ డెవఁడు?
అయా. నీ కుమారియు మారును డీకు మీఁఱఁ
గూడి గుడిగుడి గుంజము లాడికొనుచు
నున్నవార్తఁ దెల్పఁగ వచ్చి యున్నవాఁడ.
ప్రబా. మాలగాడైవు నీవు!
అయా. ఈవు —— మంత్రివి గద!
ప్రబా. వీని పదరుల పూట మీవే వహింప
వలయుఁజుమి, రుద్రగుఁడ! నినుఁ దెలియదుఁగద.
రుద్ర. అన్నిటికి నాది పూచీ గదయ్యా, యింక
సాంతముగ నా మనవి విను శాంత మొప్ప.
అయ్యా! యియ్యర్థరాత్ర మియ్యామవసనిసి
వేళ, నీముద్దుపట్టి, యాందాలపుట్టి —

తోడు పల్లెవాఁ డొకఁడు మఱేఁడు లేఁడు —
ఇలు వెడలి చని మూరుని వలపుఁ దీర్ప
నతని కౌఁగిటఁ బడుట నీ యనుమతంబు,
అభిమతము, ప్రియమైనచో, నయ్య! మేము
ఎగ్గొనర్చితిమయ్య, నీ కిపుడు; నిజము,
గొప్ప తప్పిదమని యొప్పుకొందుమయ్య;
కానిచోఁ, బాడియే యిట్లు కరుణమాలి
మమ్ముఁ దెగడుట, దూరుట, మండిపడుట?
ఆర్య! ఘనవర్య! పరువు మర్యాద విడిచి,
మీ గరువమెల్ల మఱచి, నే మిమ్ము నాక
తాయతనమునఁ జెనకుట తలఁతువయ్య!
నీకు డాఁచి, నీ మేకోలు లేక చనుట
నిక్కమేని, వక్కాణింతు నిర్భయముగ,
మఱియు, మఱిమఱి మఱియు, నోమాన్యచరిత!
నీకుమాఱి, మేల్ సుకుమారి, నిన్ను మీఱి,
పగ్గెయును మాఱి, పోఁడిమి పాడువాఱి,
నేఁడిచట రేపచటనగువాఁడు, ద్రిమ్మ
రీఁడు, వింతవాఁ, డెడకడవాఁడు, మూరుఁ,
డట్టి యథిలునిపై మోహ ముట్టిపడఁగ,
నతని పజ్జకుఁ బఱచెనయ్యా! గృహంబు

నరయుమయ్యా! పడుకటింటి యందయేని,
ఎందు నేని నీ కొమరితఁ గందు వేనిఁ —
బెద్ద ప్రెగడవు నీకును హద్దు గలదె? —
బెట్టిదములగు శిక్షలఁ బెట్టి నన్ను
దండన మొనర్పుమా, ప్రబంధ! నయబంధ!

ప్రబం. ఓరెవఁడు రోరి! వెల్గింపరోరి దివెలు!
ఒకటి తెమ్మిట; కేమి కీడొదవునొ, మన
వారి నందఱ లేపు; మయ్యారె! నాదు
స్వప్నమును బోలియున్న దివ్వార్త! సత్య
ముగ నెమదిఁదోఁచి నాగొంతుమూయఁజొచ్చె!
దివియఁ గొనిరార, యోరోరి! దివ్వె! దివ్వె!

[నిష్క్రమించును.

అయా. ఉ॥ మిత్రుఁడ! వీడుకో లొసఁగుమీ; యిఁక
నే నిట నుండరాదు; నా * క్షాత్రముఁ దీర్చికోవ
లయు కార్యమునుం దలపెట్టి వానికిన్ * శత్రు
వుగాఁ జరింపఁ జనునా? విను, మిప్పుడు వాని
పేర్మి న * క్షత్రము లంటి యున్నయది; కావున
ముఖ్యమ వాని మైత్రియున్.

మ-కో॥ ఈయకార్యమునుండి వానికి నెట్టిరట్టడి కల్గి
యున్ * ద్రోయఁజాలరు మూరు; నాతనితోడఁ

దుల్యుఁడు లేఁడు సూ * నాయకుం డొరుఁ డె
వ్వఁడున్ ; బయనమ్ము సిద్ధము యిప్పుడున్ * జే
యఁగావలెనయ్య యుద్ధము, చేరి సైప్రసు దీవి
లోన్.

చం॥ అటులగుటన్ హృదంతరమునం దథిలుం గడు మ
చ్చరించుచున్ * నటనమునం బ్రియంబెసఁగ నాఁ
డొక యేఁడుగఁ గొల్చుచున్, దటిన్ * గుటుకున
మ్రింగఁజూడఁగ నగున్, సఖ!—ఆతని చోటు చేరి
య * చ్చట నిలుతున్ ; భగీరథుని సత్రము—
ఆకడ కన్ను పీరలన్.

[నిష్క్రమించును.

వీధిలో ప్రవేశము :—ప్రబంధుఁడు, దివిటీలతో సేవకులు.

---

ప్రబం. శా॥ ఘోరారిష్టము ప్రాప్తమయ్యె! ఇఁక నా
కున్ జీవితంబందు న * బ్బో! రూక్షవ్యథ, యం
ధకారము, విషంబుం గాక వేఱొండు లే * దా
రా! యెంతటి పాపినైతిఁ! గలసత్యంబయ్యె!
— నా ముద్దు ప * ట్టీ! రాచిల్క! అయో! కిరా
తుకడఁ గట్టిక్కట్ల పాలౌదువే!

ఉ॥ నాయన, రుద్రగా! యెటుఁ గనంబడె నాదు కు
మారి?—మూరుతో * నా? యకటా! కటా!

ఝొటుల నాపెయకా మదిఁదోఁచె నీకు ? అ *
య్యో ! యిఁక నేల సందియ, మయో ! పెనుఁద
క్కిడి మోసకత్తె యే * నాయెడ నాతనూజ ?
— తగునా యిల బిడ్డలఁ గాంచు కోరికల్ ?

శా॥ తేతెం డింకను దివ్విటీలు దివెలుం ; దీపించుఁ
డీ చుట్టలన్ — * నీతో నేమనె ? — నిన్నుఁ గై
కొన మదంగీకారమిూనైతి న * న్నా తప్ప య్యోఁ
గదన్న ! — పెండ్లి ముగిసెన్గా నెంతు వే ? —

రుద్ర. మూఁడిన * శ్లేతోఁచున్ —

ప్రబం. నను పీడి, దైవము !

అయో ! యేరీతిఁ దా నేఁగెనో !

ఉ॥ కండయు నెత్తురుం గొనిన గాదిలి కూఁతురు ని
ట్లునేసె ; నో * తండ్రులార ! మీకొమరితల్
పచరించెడి వర్తనమ్మునన్ * మెండుగ నమ్మికల్
నిలిపి మీఱిన యంగదఁదెచ్చికొందురే ! * పం
డెను నాదు పున్నెము, సెబాసని హారతులీయఁ
జెల్లదే ?

ఉ॥ మందులు మంత్రముల్ గలవు,మానసముం గరఁ
గించు నంచు వా * కొందురు గాదె ? నిక్కమ
యగుం దలపోయఁగ ; బుద్ధిపేర్మి మా * యుం,

దమి మీఱు, నయ్యావి ప్రయోగము సేసిన — అ
య్యా! రుద్రగా! * కంపువె దీని నీ చదువు గ్రం
థములందు? —

రుద్ర. అవునయ్యా, సత్యమే.

ప్రబం. కం॥ ఈ తెరువు చనుఁడు కొందఱు,
నా తెరువునఁ గొందఱరుగుఁడేఁ కొందఱు; మ
ద్భ్రాతను వే రమ్మనుఁ, డీ
రాతిరి యా దుష్టుఁ బట్టి ప్రహరింపవలెన్.

ఉ॥ ఎచ్చట వారి నిర్వారను నిప్పుడ వైళము పోయి
పట్టఁగా * వచ్చును తెల్పఁజాలుదువె, బాబుర,
రుద్రగ? —

రుద్ర. అయ్యా! సాయమున్ * దెచ్చితి
రేని నే నతనినిం గనిపట్టుదు నంచు నెంచెదన్ *

ప్రబం. చెచ్చెర దండి మూఁక యిదె చేర్చెద; నాదెసఁ
ద్రోవఁ ద్రొక్కుమా.

కం॥ ఇంటింటఁ బిలిచి జనము
న్వెంటంగొనుఁ; డాయుధములఁ బెట్టుఁడు చేతన్;
బంటులఁ జీరుఁడు; — రుద్రగ!
అంటు నెఱపి త్రోవ సూపి, యట మేల్గనుమా.

[నిష్క్రమింతురు.]

రంగము ౨.

---

వెనిసు పట్టణము, మఱియొక వీధి.

ప్రవేశము:—అథిలుఁడు, అయాగుఁడు, దివిటీలతో సేవకులు.

—:o:—

అయా. తే॥ ఆలమందుఁ బెక్కండ్రను యముని కడకుఁ
బంపఁగా వెనుదీయని వాఁడనయ్యుఁ
దక్కువేళల వధకుఁ జిత్తంబు నొగిలి
చేతు లాడకుండును బాపభీతి తగిలి;
నేఁటి పుణ్యాన, ఈ నామనేమమునకు
ఎడను తప్పెను; నాల్గైదు తడవ లిచట
డొక్కలో గ్రుచ్చ నుంటిఁ గచిక్కు మనఁగ.

అథి. మంచిదయ్యె! నీయురకుంట మంచిదయ్యె.

అయా. పెద్దగా నార్చి, పలుమఱు పిలిచి లేపి —
ఎట్లొటింగెనొ కాని యూహింపఁ జాల —
ఈరహస్యంబు సెప్పి, మీ పేరు నుడివి,
మూఁడు డల్పుఁడు, కులగోత్రములు దెలియని
ద్రిమ్మరీఁడు, దోఁపిడికాఁడు, రిత్తకాఁడు,
మోటుబర్బారుఁ డనుచు, నీమొగి వచింప

రాని వినరాని నీచపుం బ్రల్లదములు
ప్రేలె — ఇన్నిన్ని యని లెక్క పెట్టరాదు ;
కోప ముదయించి రవులంగ నాఁపు కొంటి,
బల్లిమెయి, నాకె వింతయౌ తాల్మిఁ దాల్చి.

అభి. మేలు మేలు ! నీ శాంతము మెచ్చుకొంటి.

అయో. ఇంతకును ముందు మాట, మీ యిచటికార్య
మెల్ల ముగిసెనె ? కడతేఱెనే వివాహ ? —
మిదియ మీ భృత్యుఁడిత్తఱి నెఱుఁగఁగోరు.
అబ్బ సామాన్యుఁడని మన మనఁగఁజెల్ల ;
దతని కిక్కకు నందఱు నడఁగియుందు,
రవనిపాలుని కంటెను నాతని యెడఁ
బురజనుల భక్తి విశ్వాసములు సెలంగు
నెక్కుడుగ ; అట్టి బలవంతుఁ డేమి సేయు
నోయని తలంచి నాడెంద ముత్తలపడు ;
మీఁదు కేల్పట్టు విడిచియు మీకు నెట్టి
పాట్లు నిక్కట్లుఁ బెట్టునో బమ్మకెఱుక !
తనదు శక్తి సామర్థ్యముల్ దండి నెఱపి
మిమ్ము దండించునే కాని మిన్న కున్నె ?

అభి. ఉ॥ అక్కసు దీర్చుకోఁ దలఁచి యాతఁడు నాప
యి నెట్టి తప్పులన్ * గ్రక్కసలీల మోపి, ననుఁ

గాటియ పెట్టఁ గడంగినం, దుదిన్ * లెక్కకు
వచ్చునే యవి? గణింపరె నావలనన్ వెసీసు పే
* రెక్కను, వన్నెమించె, లభియించెను రాజ్య
ము నంచు మంత్రులున్?

ఉ॥ చెప్పఁగనేల యిప్పుడు? వచింపఁగఁ జెల్లునె త
న్నుఁ దాన బల్ * గొప్పగ? చెప్పుకోవలయు
కోపునఁదెల్పుదు రాచవంగసం * బొప్పును నా,
కుతాణి సిరియుం బరువుం గలవంచు; నెత్తిపై *
నిప్పురి పెద్దలట్లు చవుతెత్తకయుండిన, మూరుఁ
డల్పుఁడే?

తే॥ విను, మయూగుఁడ! దశదమానను, ధనంబు
ఘనము నందఁగఁ జేపట్టితినె? మనంబు
నందు దరిలేని మరులు మోహంబుఁ దవిలి
నన్నుఁ బురికొల్పకున్న, ఈ నాల్గు మూడు
కడళులఁ గలట్టి కలుములఁ బడయుటకును
అనుమతింతునె, స్వేచ్ఛా విహార వృత్తిఁ
బుచ్చి సంసారబంధముల్ దెచ్చికొనఁగ? —
కాని, యటుచూడు! ఆవచ్చు కాగడాలు
జోతులును ఎచ్చటివొ యూహ చొప్పఁగలవె?

అయూ. వారె తండ్రియు నాతని పరిజనములు;

మీరు లోనికిఁ జనుటయ మేలు.

అధి. ఛీఛి !

వారు నన్నుఁ గనుంగొనవలదె ? నాదు
నంగడము, పేర్మి, సిరియు నెఱింగి, విమల
మైన నా ప్రేమఁ దెలిసి, మర్యాద మీఱ
మెచ్చరే నను ? — కాని, యీ వచ్చువారు
వారె కానెంతువే ?

అయా. కారు, వారు గారు.

ప్రవేశము :—కాస్యుఁడు, దివిటీలతో రాజభటులు.

అధి. నగరు భటులును నా యుపనాయకుండు.—
నెయ్యులార ! మీ సేమము నెగడుఁ గాత !
ఏమి వార్త దెచ్చితిరయ్య ?

కాస్య. ఏలినతఁడు
నతు లెఱింగించి మిమ్ము క్షణంబ యరుగు
దేరఁగోరి పంపఁగ వచ్చినార మయ్య.

అధి. కర్జ మేమని తలఁచెదు, కాస్య !

కాస్య. అయ్య !
అల్ల సైప్రస్సు విషయమే యని తలంతు ;
ఆత్ర మాట నిజము ; నేఁటిరాత్రి, యోడ
రేవు నుండి వార్తలు పదిరెండు వచ్చె,

ఒకటివెన్క మఱొక్కటి; యోలగమున
మంతురుల్గూడియున్నారు; మఱియు మఱియు
మీకు నామతు లంపిరి, మేటిమగఁడ!
విడిదిపట్టున మీ రగపడక యిపుడు
ముత్తైగలఁ బంచిరయ్య మిమ్ములను రోయ.

అథి. నన్నిచటఁ గనిపట్టుట నాఁడెమయ్యె;
కాస్య! యీ యింటిలోన నొక్కనుడి నుడివి,
యిదిగొ వచ్చితి మీవెంట నీక్షణంబ. [నిష్క్ర.

కాస్యు. అనుచరా! యేమి సేసెను నథిలుఁడిచట?

అయా. నెచ్చెలీ! యిట నతనికి లచ్చి దొరకె;
అదియు దక్కినచో నేమి కొదవ గలుగు?

కాస్యు. తేట పడదయ్యె నీమాట.

అయా. తెలియు, మన్న!
అతని కిటఁ బెండ్లము లభించె.

కాస్యు. అది యెవర్తి?

అయా. ఎవరితా? — [పునః ప్రవేశము:—అథిలుఁడు].
నాయకా! సిద్ధమే వెడలఁగ?

అథి. తెరలుఁడిఁక.

కాస్యు. అదె! మఱియొక తెగయువచ్చె.

అయా. అది ప్రబంధుఁడు. — నాయకా! పదిలమయ్య!

అతఁడు చెట్టసేయఁగ నెంచి యరుగుదెంచు.

---

ప్రవేశము :— ప్రబంధుఁడు, రుద్రగుఁడు, దివిటీలతోను ఆయుధములతోను సేవకులు.

అధి. హాఁ! నిలుండట దవ్వుల.

రుద్ర. ఓ ప్రబంధ!

వాఁడె మూఁరుఁడు.

ప్రబం. చోరుఁడు! పట్టుకొనుఁడు!

[ఇరు ప్రక్కలవారు ఖడ్గములు దూయుదురు.

అయా. రమ్ము, రుద్రగ! యెదురయి రమ్ము నాకు.

అధి. పట్టియములెల్ల నెఱలలోఁ బెట్టుఁడింక,
మంచునకుఁ ద్రుప్పుగాని యవి మాసిపోవు ;—
ఆర్య! ప్రెగ్గడపెద్ద! మీ యాయుధముల
కన్న మీయొంట్లు తద్దయు గారవింతు.

ప్రబం. శా॥ చోరాగ్రేసర! యెడ దాఁచితివిరా, శుం
ఠాధమా మత్సుతన్? * క్రూరాత్మా! యిటు
ముద్దరాలిఁ గని సీకుం జెల్లునే మంత్రముల్ *
పారంజేసియు మందులం దెలివి తూలం బుచ్చి
యిల్వ్యాపి తో * ద్దేరం దేఁకువగాంట? ఘోర
వ్రుర! భీతిం గాంచవే గుండియల్?

చం॥ జననముఁ దొట్టి పోమెసఁగి జడ్డయెఱుంగని బిడ్డ,

తన్నుఁగే * ల్కొనఁజనుదెంచు రాకొమరులున్
మది లెక్కని కన్నె, పెండ్లియా * డనని ప్రతిజ్ఞ
సేయు నబలామణి, యచ్చపుఁ బైఁడిబొమ్మ, మే
* ల్గానముల రాసి, రక్కసిని గోరి వరించెనె నిన్ను
మూరుఁడా ?

ఉ॥ గారడికాఁడ ! నీ కపట కార్యము లీయెడ సంశ
యింతు రే * యేనును ? నమ్మఁ జాలుదు రె యి
మ్ములఁ జిమ్మి భయమ్ముగూర బ * ర్బారుని పజ్జకుం
బఱచె బాలిక నా; నగ రే ? కిరాత ! బల్ * ఘో
ర పుమాయలన్ వసముగొంటివి నాయనుఁ గుం
గుమారితన్.

కం॥ ఈ నేరమ్మును న్యాయ
స్థానమ్మునఁ దెల్పి నిన్ను దండితుఁ జేయం
గా నిశ్చయించితిని ; ని
న్నీ నిముసమ పట్ట నాజ్ఞ యిచ్చెదఁ గనురా.

తే॥ బంటులార ! యీ దుష్టునిఁ బట్టికొనుఁడు ;
మన వెనిసుపురి శాసనాలను దృణీక
రించి, దాఁటి, మీఁటిన కల్లరీఁడు వీఁడు ;
దండనాయకుఁ డని మదిఁ దలఁప వలదు ;
భయపడక ముట్టుఁడీ ; పట్టువడఁడ యేని

గొట్టుసేసియుఁ గనరు మీరెట్టి సొంటు.

[ఇరు ప్రక్కల వారు ఖడ్గములు దూయుదురు.

అధి. నిలుఁడు ! నిల్పుఁడు మీ ఖడ్గములను!—మీరు ;
మీరు నావారు : నాకును దారి సూప
వలయునే యిటఁ జివ్వాయు వలనయేని ? —
సచివవర ! మీ ముదల శిరసావహింతు ;
నాదు నేరంబుఁ దీర్చికొనంగ నిపుడు
మీరు నన్నెచటికిఁ జనఁగోరువారు ?

ప్రబం. ఎచటికా ? బందెకానాకు — అచట నిల్చి
యుండవలయు, నిను బిల్చి నీ దుండగమ్ము
నరయువరకు.

అధి. విధేయుఁడ నౌదునయ్య ;
కాని, యద్దాన మనజేని కర్జ మెట్లు
తీరఁగలదు ? నాకై యిప్డు వీరి నంపి
నారు, వెంబడి వడిఁజను దేరఁ గోరి.

భటు. సత్యమయ్య, వజీరయ్య ! సభను దీర్చి
యున్నవాఁడు జేఁ డిప్పుడ ; యొక రొకరుగ
మంత్రులును సభ్యులును జేరి మంతనములు
సలుపుచున్నారు ; మీకయి పిలుపు నంపి
నారు ; నే నెఱుంగుదునయ్య, నమ్ముమయ్య.

ప్రబం. — [కవిరాజ విరాజితము.]

అవనిపునోలగమా నడిశేయుని !—హా !—అగుం
బో! కొనిరం డితనిన్ ;* ప్రెవడలు జేఁడు గణిం
పరె నామొఱఁ బెద్దగనుం దమ యంకిలిగన్ ? *
రవులకయున్నె యనర్థము లిట్టి దురాగతముల్
భరియించినచోన్ ? * నవగాని తెక్కలి కాం
డ్రఱజాతు లెసంగరె యింతట మంతురులై ?

[అందఱు నిష్క్రమింతురు.]

---

## రంగము ౩.

---

### రాజగృహమున సభాస్థానము.

ప్రవేశము :—రాజు, మంత్రులు, సభ్యులు - ఒక బల్లచుట్టుఁ గూర్చుండి ;
రాజభటులు - సమీపమున నిలిచి.

---

రాజు. తే॥ ఏది నమ్ముటకును దోఁచరాద — యిపుడు
తెలుపఁబడిన యుబుసులు పలు తెఱఁగులయ్యె.

మం. వాస్తవమె యెచ్చుతగ్గు లివ్వార్తలందు ;
నాదు లేకలు నూటాఱు నావలనెడి.

రాజు. నావి నుడినెడి నూట యెన్బది యటంచు.

సభి. నాయవి వచించు నిన్నూఱు నావలనుచు ;

కాని, యీ భేద మంత ముఖ్యమ్ముగాదు,
దూరమునసుండి గణియించు కారణమున
వేలు వేలు లెక్కలగుట వింతలేదు.
స్పష్ట మొకటి యివ్వార్తల వలన నిపుడు —
తురక దండు సైప్రస్సుకై తొడరి సనుట.

రాజు. అది నిజము, సంఖ్యభేదములైన నేమి,
మొత్తమున నిందు మనకు విపత్తుఁ గందు.

నావి. — [తెరలో] — హూ! యొహూ! తల్పుదీయుఁ
డు. హూ! యెవరట?

భటు. ఓడ రేవునుండి మఱొక్క యుబును నదిగో!

ప్రవేశము :— ఒక నావికుఁడు.

రాజు. ఏమి వర్తమానము దెచ్చి తీవు నిపుడు?

నావి. తేఁడ! అల్ల తురుష్కుల యోడలెల్ల
రోడ్సు దీవి నంటఁగను దర్లుగతి నున్న
వనుచుఁ దెల్ప నాంగలుఁడు నన్నంపినాఁడు.

రాజు. ఎప్పగిది సెంతురయ్య యీ చొప్పు మార్పు?

మం. నామదికి నిది దండి తంత్రముగఁ దోఁచు.
పగతునకు రోడ్సు కన్న సైప్రస్సుదీవి
యే ప్రధానము; బందోబస్తైక్కు డగుట
రోడ్సు గడ్డను గెల్చుట రూఢి కాదు;

సైప్రసున దిట్టమైన రక్షణము లేదు ;
ఇయ్యది తురుష్కుఁ డెఱుఁగఁడె? యేల యతఁడు
చుల్క దొడ్డ లాభమ్ము దెచ్చుపనిఁ దొఱఁగి
అల్పమును గోరి కష్ట కార్యమును బూను?
వెడఁగె? యాతని ప్రస్తుత విధము మనకుఁ
గంట దుమ్ము సల్లుట, యొండు కాదు సుండు!

రాజు. రోడ్సునంటు యత్నము కికురుగనె తోఁచు.

భటు. ఇల్లిదిగో మఱియొక యుబుసితఁడు తెచ్చె.

ప్రవేశము :—ఒక వార్తికుఁడు.

వార్తి. ప్రభువరా! మంత్రివరులార! వార్త వినుఁడు.
తురక యోడలతోఁగ రోడ్సు త్రోవ సనుచు,
వెన్కనుండి మఱొక పఱ బెరసికొనఁగ
మరలి, సైప్రస్సులంకకై మఱుఁగు లేక
తరలుచుండెడి.

మం. ఔర! నేఁ దలఁచినట్లె!
క్రొత్తకలముల మొత్తము కూర్చినారొ?

వార్తి. ముప్పదియు నాలు; గివ్వియు ముందటివియు
సైప్రసును ముట్టవచ్చుట సంశయింప
వలదు, వలదు, ముమ్మాటికి వలదటంచుఁ
జెప్ప నన్నిట కంపె మీసేవకుండు,

మహితధైర్యుండు, ప్రతినిధి, మంతనుండు.

రాజు. పైప్రసున ముప్పుమాట నిశ్చయము ; యింక
బలమునంపి యా దీవిని భద్రపఱుచు
టొప్పుఁ ; దడవు సేయఁగఁ జెల్లదొక నిముసము.

మం. సత్యమదియు ; వేంచేసిరి సమయమునకు
మనవజీరులు, సేనానియును — గనుండు !

ప్రవేశము :—ప్రబంధుఁడు, అఖిలుఁడు, అయాగుఁడు, రుద్రగుఁడు, భటులు.

రాజు. కం॥ రణధీర ! అఖిల ! నిన్ని
క్షణమతురుష్కులకు నెదురుగా నంపవలెన్ ;—
కన లేదు మిముఁ బ్రబంధ ! త
మనైపుణి కొంతవడియె మాకిర్యోడలన్.

ప్రబం. చం॥ కొఱవడెనయ్య నాకుఁ దమ కూరిమిసాయ
ము నేఁటి రేయి ; భూ * వర ! క్షమియింపుమా,
యిచటి వార్తలుఁ గార్యము నే నెఱింగి య *
క్కడఁ జనుదేర లేదు ; పెఱక్రందులు నా మది
నంటఁజాల వి * త్తతి, దరిలేని నాదగు వెతారమె
నన్నబళించెడి న్గటా !

రాజు. తే॥ ఏమి ! యేమి యాపద జనియించె, నన్న !

ప్రబం. నా కొమారితె ! అయ్యయో ! నా కొమార్తె !

రాజు, సభి. — చెల్లెనా యేమి ?

ప్రబం.   ఔఁ, నాకుఁ జెల్లినట్టె!
కోయమందులచేతను గొల్లవోయె,
మాయమయ్యెనుమంత్రముల్ మరులుగొలుప;
అటుల మతిసెడకున్న నెందైనఁ గలదె
మానవతి విపరీతపు మార్గ మొప్పి
యడుగిడుట, వెఱ్ఱి వెకలి వీఁడేయుఁ గాక ?

రాజు. ఉ॥ అన్న ! ప్రబంధ ! యెవ్వఁడు నయంబు భ
యంబును బాఱఁదోలి యీ * తెన్నున నీ కొ
మారితె మతింజెఱుపం దనుఁదానుబాసి యా*
కన్నియ నీకుఁబాసె, నల కట్టిఁడిఁ గాఱియ పెట్టి
శిక్షలం * దిన్నగఁ బన్నమీవ ; వెనుదీయకు
నాకొమరుండ యేనియున్.

ప్రబం. చం॥ ప్రభువర ! వందనమ్ములు ! కృపాభరితమ్మగు
మీ వచస్సు నా * దుభయ మొకింత మాన్పె;
— అలదుష్టుఁడు వీఁడె, కనుండు, మూరుఁ, డీ *
సభకునుబిల్వనంపఁగ వెసంజనుదెంచియుఁబంపు
సల్ప పెన్ * రభసముదాల్చి నాఁ ; డిపుడు నా
యిలుగూల్చిన నాయకుం, డయో !

రాజు, సభి. — తే॥ కడువిచారమయ్యెను మాకు.

రాజు.   కాని, యఖిల !

ఏమి చెప్పెదువయ్య యిట్టియెడల నీవు ?

ప్రబం. చెప్పునది యేమి, చేసినట్లొప్పుకొనుటె.

అధి. మేటిప్రభులార ! పెగ్గడమిన్నలార !
దివ్యమతులార ! మత్ప్రియాధిపతులార !
నిజము యీవృద్ధు కొమరిత నేనుగొంచుఁ
బోయినట్టి సుద్ది ; నిజమ్ము, బొంక నేల,
పెండ్లియాడితి నాపెను బ్రియము మీఱ ;
ఇదియ నా యపరాధ మింకేమి లేదు.
ఆర్యులార ! యీ బాహువులందు నెనిమి
దేండ్ల చేవ చేరిన దాది యెడరు లేక —
యిప్పు డిప్పదిమాసము లే విడుమర —
కదనమధ్యమునందు సంగ్రామభూము
లం దెడారులయం దరణ్యములయందుఁ
గాలమెల్లను గడపిన కతన నేను
బాజులును గత్తులుఁ గటార్లుఁ బవరములును
జక్కఁ దెలియుదుఁ బల్కంగఁ ; దక్కవార్త
లెఱుఁగ ; నీప్రపంచజ్ఞాన మెచ్చు లేదు ;
నాగరిక మృదుభాషయు నాకు రాదు ;
మోటువాఁడను, మాట నేర్పు నిసుమంత ;
కాన, మీమది కెక్కునే నా నోడుగులు ?

అయిన, దయ మీఱ నవధారుఁ, డయ్యలార!
నాపయిని మోపనైన యీ నైపు దీఱ
మా పరస్పర ప్రేమ జన్మమ్ము వృద్ధి
కలతెఱంగెల్లఁ బూఁత లేక వచియింతు;
ఎట్లు లభియించెనో నాకు నితని కూఁతు,
రీతఁ డుగ్గడించినయట్టు లేమిమచ్చు
లేమిమందులు మంత్రమ్ము లేటి మాయ
గారడి ప్రయోగమయ్యెనో కానవచ్చు.

ప్రబం. ఉ॥ మాయలు మందులు న్గరులుమంత్రములుం
బని లేక వీని కే* చాయను జిక్కె మత్సుతయు?
సాధుసుశీల యనల్పభీతిల* జ్ఞాయుత నైజముం
దొఱఁగి జాతియుఁ బాయము రూపు చంద మే*
లాయని నింద నెంచక భయంకరపూరుషు మూ
రుఁ గోరునే?

తే॥ నా పొగడ్తయు వలయునే? నా కుమారి
యిట్టి వైపరీత్యము మది నిచ్చగించి
యితనికడ కేఁగునని జ్ఞాను లెంచఁగలరె?
దుష్టనారకోపాయముల్ దొట్టుకొనుట
వలన స్వాభావికవిరుద్ధ వర్తనమ్ము
పట్టెఁ గావున మఱియు నే వక్కణింతు —

మచ్చుమందులమై మది మరులు కొల్పి
దశదమాన నీ కూళుఁడు వశము గొనియె —
వాస్తవము, వాస్తవము, నమ్మవలయుఁ జుండు.

రాజు. గోట్టుమాటల నీక్రియ గట్టిగా వ
చించి ఫలమేమి, సాక్ష్యమ్ము చేతఁ గాదె
యితని నేర మిచ్చో నిశ్చయింపవలయు ?

మం. అఖిలనాయక ! పల్కుమయ్యా నిజమ్ము —
తక్కులను దంత్రములఁ జేసి దశదమానఁ
గొంటివా, నయపథమునఁ గూర్మి నెఱపి
కూరిమి గడించికొంటివా కోర్కెఁ దెలిపి ?

అఖి. ఉ॥ విన్నప మొందు గైకొనఁగ వేఁడుదు నిత్తఱి
నయ్యలార ! ఆ * యన్న వనీడనుం బిలువ నం
పియు నీ కతమొల్ల నమ్మఁడే * కన్నయ మ్రోల ;
నన్నుఱిచి కాంత యొకింతయు నెగ్గు చాలెనే *
నన్నిముసమ్ము నా కొలువు నంతము సేసి శిరమ్ముఁ
ద్రుంపుఁడీ.

రాజు. తే॥ దశదమానను దోడ్తెండు.

అఖి. దాఁకెసూప,

ననుచరా ! వారి వెంట నీ వరుగుమయ్యా —

[అయోగుఁడు, రాజభటులును నిష్క్రమింతురు.]

ఇంతలోపలఁ, బ్రభులార! యేను మీకు
విన్నవించుకొందు, వినుండు వీనులొగ్గి,
దశదమానకు నాకు నెత్తుటిని నెట్టు
లొండొరులపయిఁ బ్రేమలు మెండుకొనెను —
ఈశ్వరుని మ్రోలబలె సత్యమే వచింతు.

రాజు. కలతెఱఁగు దెల్పు దాఁపఱికమ్ము లేక.

అఖి. దొరలు, వినరయ్య! యీ ప్రబంధుండు నన్నుఁ
బ్రియముతోఁ దనయింటికిఁ బిలిచి నాకు
విందు గుడిపెను వేమఱు వేడ్కఁ దనర;
ఆదరమ్మున నెప్పుడు నాదు చరిత
మాదినుండియు వినఁ గుతూహలము నందు
చుండు; మఱిమఱి నను వేఁడుచుండు నితఁడు
వివరణముతోడఁ జెప్ప నాబవరములను
ముట్టుకోళులఁ గడగండ్ల ముదులనెల్ల.
అయ్యలార! యీ నా ముచ్చటంత నుడివి
నాఁడ, నూటిగ నా చిన్న నాఁటఁ గోలె;
అందు నన్నంటి నట్టి పేరంగదలును,
నేలపై నీటిపైని మున్నిటిపైనిఁ
దప్పి నన్న యవాంత్రముల్ దెప్పరములు
ముప్పులును, మృత్యుదేవత ముఖమునుండి

యనుటతోఁ బైటఁబడ్డ నాదు సుకృతమ్ము,
పగతు చేఁ జిక్కి బానిసపనికి విపణి,
మటఁ బగిడి యిచ్చి విడుపుఁ జెందుట, పదపడి
దేశ దేశములందును ద్రిమ్మరుటయు;
నాకనిన పర్వతమ్ములు, నభమునంటు
శిఖరములు, శిలాబిలములు, చీఁకటి గుహా,
లడవు, లెడరులు, పాడు బయళ్లు, కాళ్లు,
నాళ్లు, సందలి వింతజనములు, చిఱుత
రక్కసులు, నొండొరులఁగూల్చి మెక్కువారు,
బాహువులక్రింద శిరము లొప్పారు వారుఁ,
గడువడినిఁ దలక్రిందుగ నడచువారు,
గబ్బిడాలట్లు చెట్ల నూఁగాడు వారు;—
ఇట్టి వెన్నొ పేర్కొంటి నూఁకొట్టువారి
మనము లువ్విళులూర సమ్మదము మీఱ.
ధన్యులార! యియ్యది యెల్ల దశదమాన
ఆసతో వినుచుండు; గృహమ్ము నందుఁ
బనులనారయ సని చిటుక్కనఁగ వచ్చి
మఱియు నాలించుచుండు నక్కఱ యెసంగ.
ఈకిటు కెఱింగి, తఱివేచి, యాకె మున్ను
ముక్క ముక్కగ సంతసమ్మునను విన్న

వింత చరితమ్ము తెంపు రవంత లేక
చెప్పుమని బతిమాలంగఁ జేసికొంటి.
అంత, దండఁగ్రుచ్చి యుదంత మెల్లఁ
జెప్పఁదొడఁగిన, నాగొప్ప ముప్పాలు విని
కలికి కన్నీరు మున్నీరు గాఁగఁ గురిసె.
కత ముగియు నంత నా కాపె కాన్క-వెట్టె
వేన వేలు నిట్టూర్పుల వేఁడిగాడ్పు ;
అద్భుతము, మహాద్భుతము, కృపానుభావ్య,
మధిక కరుణాభిషిక్త మటంచుఁ బలికె.
అపుడు నా మొగమ్మున మందహాసము గని
మఱియు నిట్లనె మగువ — ఓ మగల మిన్న !
నీచరిత వినకుండిన నెమ్మి యనుచు,
వినియు నీయట్టిపురుషుని వేల్పుఁ బెద్ద
నాకుఁ గూర్చియుండిన లెస్సగాక యున్నె
యనుచు, మది నెంచి వగతు ; నన్ను భిలషించు
హితుఁడు నీకుండెనేని, వేయేల, యతఁడు
నీదుసుద్ది నీవలెఁ జెప్ప నేర్చికొన్న
నను గెలిచికొంట నిక్కము యని తలంతు.
ఇట్లు నుడువంగ నేఁ బల్కు నెడము గల్గె ;
అతివ నన్మెచ్చి వలచె నా యలజడులకు,

నా పయిని నక్కటికగొన నాపెయందు
వలపు తవిలెను నాకు ; నావశ్యమంత్ర
మింతె, నామచ్చుమందును నిదియె సుండి !
అదిగొ నరుదెంచె ! ఆపె నే యడుగుఁ డింక —
ద్రోవలో నెదురైరి కాఁ దోఁచు నాకు.

దూరమున ప్రవేశము :—
దళదమాన, యామిలి, అయాగుఁడు, భటులు.

---

రాజు. ఉ॥ కన్నియ లీకత న్వినినఁ గల్గదె మోహము
నా కుమారియేఁ * అన్న ! ప్రబంధ ! చింతిలిన
హానియ చేకుఱుఁ ; గాన దీనిఁ ద * ప్పెన్నక కై
కొనందగు సహించుచు—ఆయుధముల్ సెడంగ
వీ * డన్నయమొక్కొ ? మేలొకొ లడాయిని
రిత్తకరమ్ములుఁ ధరఁ ?

ప్రబం. ఉ॥ చిత్తము ! నాదు పుత్రికను జెప్పఁగనిం ; డఱ
పాలయేనిఁ దా * నిత్తెఱఁ గొప్పికొన్న నిఁక నీ
తని నింద యొనర్చినఁ ననుఁ * మొత్తునకాక
దయ్యా ! — [దళదమాన మూరు కడకుఁ బోవుట గని]
మెటఁ బోయెదు, ముద్దియ పెద్ద !
కానవే * తత్తఱ నీ విధాయకుఁ డితండని యీ
సభనున్న వారిలోఁ ?

దశ. సీ॥ మత్ప్రియ జనక! నీ మన్నింపు వేఁడెద,
నిత్తఱి నామది కిరు తెఱఁగుల
విధి గానిపించెడి; విను, నీదుకృపఁ గంటి
జననమ్ము, పెన్పును జదువుఁగొంటి;
నా పెన్పు సదువులు నాకుఁ జెప్పెడినయ్య
నా విధాయకుఁడవు నీ వటంచు;
తండ్రివి నీవు, నేఁ దనయన యిన్నాళ్లు,
నితఁడిప్డు నా వరియించినతఁడు;
తే॥ నాదు తల్లియు నీపయి న ర్తిలిఁగొని
జనకునకుఁ గొంత యెడమయి తనరినట్లు
నేను నీయనకుంగూర్చి నెఱపరాదె
బత్తి యొక్కింత? యిది ధర్మపథము గాదె?
ప్రబం. తే॥ తల్లి! నాచింత దీఱెను! చల్లగాను
వర్ధిలుము!—అయ్యొ! యింక మీాపనులనరయుఁ;
డాఁడుబిడ్డఁ గనుటకన్న యన్ని యెఱిఁగి
పెంచుకొంటయ మేల్గద!—వీర! మూర!
రమ్మిటకు, నేన యిత్తుఁ గైకొమ్ము తనయ;—
నెమ్మదిని సమ్మతించి యీానెలఁత నీకు
నిచ్చితిని—నీవ చేకొన్న పొచ్చె మెంచి;
కానిచో నెమ్మదిని నియ్యలేన నీకు;—

మానికమ! నాకు నో ర్త కొమా ర్త యనుచుఁ
బెల్లుగా నుల్లమున సంతసిల్లువాఁడ;
నీ పలాయనమునఁ జేసి పాపమనక
యేమి బొండల బందెల నెట్టి చెఱల
నిడుదునో మఱియొక బిడ్డ, నెఱుఁగఁజాల! —
ప్రభువరా! యింక రాచ కార్యమ్మరయుఁడు.

రాజు. చం॥ ప్రియహిత! యో ప్రబంధ! కడుఁ బెద్దవు,
నీకును జెప్పవచ్చునే * నయములు నీతులుం ?
బసితనమ్మున బాలిక తప్పుసేసియుం * దయకు
ను బాత్రమేయని యెదం దలపోయఁగ రాదె ?
సత్ప్రతా * ప! యిపుడ యీ వధూవరులపైఁ
గృపగల్గ నెకింత వల్కొదుర్.

కం॥ తప్పించు నుపాయమ్ములు
తప్పక యుండంగఁ గాదె తాప; మవెల్లం
దప్పియు ముప్పుం జొప్పడ
నొప్పునె మది నొగులుగనఁగ, నోయి ప్రబంధా!

కం॥ కడచినదానికి వగచినఁ
జెడుగులు క్రొత్తలును దొడరు; సిద్ధంబిది; యొ
వ్వఁడు తా నదృష్టమునఁ జెయి
విడువంబడి శాంత మూను వెతగనఁ డతఁడుర్.

క॥ దొంగకుఁ గోల్పోయిన తఱి
నిం గుందని యతఁడు చెఱచు నిండు ముద మ్మా
దొంగకు; నిష్ఫలముగఁ గుం
దంగడఁగినఁ దన సుఖమ్ము తాఁ జెఱచుకొనున్.

ప్రబం. క॥ నిక్కమ వల్కితి, రిపు డీ
త్రొక్కట మన కేల? అల తురుష్కుఁడు సైన్య
స్నెక్కిన నెక్కఁగ నిం, డే
తక్కువ మన కగును నెమ్మిఁదాల్చి నగినచోన్?

తే॥ సులభముగఁ జెప్పవచ్చు నీచొప్పు నీతు;
లురక వినువారి కవి హర్ష మొదవఁజేయు,
నెవ్వ తవిలిన మదిఁదాఁకి నొప్పి పెంచు;
ఇరువగల నిట్టి వాకుల యుఱిది మెండు;
కొదువ యే, నుడికారముల్ కోటి గలవు;
కాని, హృదినంటి రవులు నంగద యణంగ
వీనులందు మందులపోఁత విని యెఱుంగ;
ప్రభువరా! యింక రాచ కార్యములు గనుఁడు.

రాజు. వ॥ అఖిలనాయకా! మన సైన్యస్సుదీవి పైఁ దురు
ష్కుండుద్దండ సైన్యముం గొని దండెత్తఁగడంగి
యున్నవాఁడు. అచ్చటి కట్టడమ్ముల భద్రస్థితి
నీవు చక్క నెఱుఁగుదువు గదా! అచ్చోనున్న

మన ప్రతినిధి శౌర్య సామర్థ్యముల నించుకేనిఁ గొఱవడని వాఁడయ్యు, మాననీయమ్మగు సర్వజనాభిప్రాయమ్ము నీ యుక్కణ మ్మెక్కుడుగ భావించి యుగ్గడించుటం జేసి నిన్ని క్షణమ రక్షణార్థమనుప వలసెడిని. కావున నీ నవీనభాగ్య సంభ్రమంబు పంక్తి ప్తంబుగావించికొనిగడబిడలంబడి దడదడ నీదండ యాత్రకార్యంబునం దవిలి సన వలయు.

అభి. సీ॥ మహనీయులార ! సమ్మానిత ప్రభులార !
మత్కార్యఫలము సమర్చె నాకు
అనుపక త్తళముల్ కఠినమైన శిలలు మె
త్తని హంసతూలికా తల్పములుగ ;
చింత నేయవ యే నెకింతయుఁ ; గష్టకా
ర్యములె నా మదికి సర్దా గడించు ;
మీాయానఁ గడు వేడ్కమెయిఁ గొంటి, నిపుడ తు
రుష్కులపైకి చ్ఛరునను బఱతు ;
తే॥ మనవియొక్కటి నాది గై కొనఁగ వలయు —
నాపతి వసింప గృహ, మా పెగాసమునకుఁ
బసిఁడి, వరువున కగురీతిఁ బరిజనమ్ము,
నియ్యవి యొసంగియు ననుగ్రహింపవలయు.

రాజు. జనకునింటనె యుండుఁగా!

ప్రబా. చాలు నయ్యా!

ఒల్లఁ జాలన యది.

అధి. ఏను నొల్లఁజాల.

దశ. తగద యిత్తఱి నాకును దండ్రి కనుల

యెదుటనుండి యాతని కన నెఱియఁ గనుట.

జియ్య! నా మొఱాలింపఁగఁ జెవి యొసంగి

కవ్వడెటుఁగని నన్ను మీ కరుణయందుఁ

బలుకునందును గననిందు ప్రాపునుంత.

రాజు. తడయక వచింపుమా! అమ్మ, దశదమాన!

దశ. సీ॥ పదుగురిలో నగుఁబాటని తలఁపక

జాతివారలకు నసహ్య మనక,

పోఁడిమికిని జేటు మూఁడుట లెక్కింప

కే మూరు వలచి పెండ్లాము నైతి;

అతని సద్గుణ గణమందు రూప విలాస

మును గని మైచాయకును దనిసితి;

అతని యుత్కృష్ట కార్యములకు నా యాత్మ

యును జీవనమ్ము నప్పన మొసఁగితి;

తే॥ కానఁ బ్రభులార! యాతనితోన యేను

సనక యిట నిల్చి సుకములఁ గనుచునుండఁ

జెల్లునే? నాదు సేవలు చెల్లిపోవె?
భర్తవెంబడి నన్నుఁ బోవంగ నిండు.

అధి. సీ॥ ఘనులార! యూపె వాంఛ నొసంగరయ్య! నేఁ
బలుకుదు నెల్ల వేల్పులు వినంగ —
ఇట్లు వేఁడఁగ నయ్యో నింతి స్వాంతము సంత
సిల్లుటకయి, విశ్వసింపవలయు;
అల్పసుఖమ్ముల నపుడప్పు డందంగ
నాస చెందుచు మిమ్ము నడుగ లేదు;
నెలఁత నా చెంత నున్కిం జేసి విహితముల్
పాలుమాలికఁ గనఁ జాలనయ్య;
తే॥ బొమిడికము నాశిరముపైన నిమిడియుండు
తఱిని విఱివిలు కాని తత్తఱము నన్నుఁ
గమ్మెనే నా శిరస్త్రమ్ము కాఫినీరు
గ్రాఁచు పాత్రఁ జేయుఁడు నర్క బరాభవింప.

రాజ. తే॥ సరియె, నీయింతి నీ వెంట సనుట యిచట
నిలిచియుంటయొ సరగున నిశ్చయించి
యిచ్చవచ్చిన చొప్పున నింపుగనుఁడ;
తడయరాదు సైన్యపన్ను యాత్ర వెడలంగ
వలయు వైశమ్ము, వ్యవధి యల్పమ్ము సుమ్ము.

మాం. నేటి రేయిఁవ పయనమ్ము నివ్వటిల్ల

వలయు.

అథి. సిద్ధము! డంబు సంబరము మీఱ.

రాజు. ఉదయమునఁ బదిగంటల కోలగమ్ము
మఱియుఁ గూడుద;—మథిల! నీ పిఱుఁద మాదు
సనదు లాంఛనములు గొని సనఁగ నిచట
నిల్పు మొక్క యుద్యోగిని నిర్ణయించి.

అథి. చిత్తము, ప్రభూత్తమా! తమ సేవకుండు
నా యనుచరుండు విశ్వసనీయుఁ డతని
నిల్పువాఁడ, దేవర కరుణించు వాని
నెల్లఁగొని నాదు సతిజంట నేఁగుదేర.

రాజు. మంచి, దట్టుల కానిమ్ము. — మంత్రులార!
అందఱకు సేమమగుఁగాత! — అన! ప్రబాధ!
సద్గుణ గణమ్ము నరునకుఁ జక్కదనమ
యైన, నీ యల్లునకుఁ గొఱమా నె వన్నె?

మం. జయము భద్రము నీకు నెసంగుఁగాత!
అథిల! దశదమానను గనవయ్య దయను!

ప్రబం. — [దోదకవృత్తము.]
మూరుఁడ! కన్నులు మూయకు! నన్నున్
మోసెను దండ్రిని, మోఱదె నిన్నున్?

[రాజు, మంత్రులు, సభికులు, భటులును నిష్క్రమింతురు.

అధి. నారి సుసాధ్వి యనఁ వెనుదీయఁ ;
భారము వెట్టుదుఁ బ్రాణము యేనిఁ. —

తే॥ అయ, అయాగ! విశ్వాసపాత్ర! యిదె యిపుడు
దశదమాన నుంచితి నీదు వశము నందు ;
నీసతిని సాయముండఁ బనిచి బిరాన
వెంటఁ గొనిరమ్ము, వసతికి వీలుఁ జేసి. —
ప్రియ ! దశదమాన ! ఒకగంట వేళ మనదు
మురిపెములకుఁ గార్యమ్ముల ముచ్చటలకుఁ
గలదు ; రమ్ము, వేగిరపాటు గనఁగవలయు.

[అధిలుఁడు, దశదమానయు నిష్క్రమింతురు.

రుద్ర. అయాగ ! —

అయా. తే॥ ఏమి ! ధీర శిరోమణీ ! యేమి సుద్ది ?

రుద్ర. ఇపుడు నేనేమి సేతునం చెంతు వీవు ?

అయా. ఏల ! యింటికి నేఁగి హాయిగఁ బరుండి
నిద్రపోవుటె.

రుద్ర. ఎందే మునింగి యుక్క—
డంగఁజూచుచు నున్న వాఁడను, సుమిత్ర !

అయా. అటులు సేసితివేని బిమ్మటను నిన్నుఁ
బ్రియపడన ; యింత తెంపేల, బేలమగఁడ !

రుద్ర. బ్రదుకు భారమ్ముదోఁచుచు బాధగనిన,

మనుట యెవ్వనికిని వట్టి మడ్డితనము ;
మృత్యుదేవత వెజ్జుగా నెపుడు తనరు,
అపుడు మరణమ్మకద పరమౌషధమ్ము !

అయా. పిచ్చివాఁడవు ! నేను నీపృథివి మీఁదఁ
గాలువెట్టి నాల్గేడులు గడచి సనియె ;
మేలు కీడెఱింగిన నాఁటఁగోలె నాకుఁ
గానఁ జేడను దనవాసి గనఁగలతఁడు ;
పికిలిపిట్టను వలచి తాఁ బిలుకుమార
నెంచఁగాఁ జెల్లునే ? యిది యేటివెఱ్ఱి ?

రుద్ర. వలపు దవిలి కుందఁగ లజ్జపడుదుఁ గాని,
మానఁగల పున్నెము గడింపలేని వాఁడ.

అయా. పున్నెమట ! పులిజున్నట ! పొమ్ము ! మనదు
తెన్నులన్నియు మనచేత నున్నవి సుమి.
మనదు కాయమ్ము లరయుమా మనవనములు ;
ఈ వనమ్ముల పాలకు లెవరు ? — మనదు
నిర్ణయమ్ములె, మన మనోనిశ్చయములె ;
కాన, ముండ్లపొద ల్పెంపుగన్న, మేలు
పూఁబొద లొప్పదలినఁ, గల మొక్కలెల్ల
నొక్క దినుసయి మీఱినఁ బెక్కుజాతు
లైన, నెద్దియులేక బీడై చెలఁగిన,

అన్నిటికి మూలకారణ మాత్మనిర్ణ
యమ్ము కాదె? అంతయు మనయంద లేదె?
బ్రతుక నెడి త్రాసునం దొకప్రక్క మనదు
కోర్కెలాసలుఁ గ్రిందికి గుంజుచుండ
మన వివేకమ్ము నావలి మొనను జేరి
త్రొక్కి నిల్పదె? కానిచో, నెగ్గు గనక
కండక్రొవ్వున నెన్నెన్ని కానిపనులు
సేయఁ గడఁగుదుమో, చేసి చెడియెదుమొ!
కల్లి యమునకు లోఁగక గంతువేయు
మన మనోవికారమ్ముల, మనదు చిత్త
చాపలమ్ములఁ, దముల, జంజాటములను —
ఈ తెగలలోని దానయ్య నీతగులము —
వీని నణఁపని మనదు వివేక మేల?
వలపు మురిపెమ్ము మూన్నాళ్ల బులుపు సుమ్ము!

రుద్ర. ఎంతువే యట్టు? లిది యేటి వింతమాట!

అయా. రుధిరమున జనియించిన రోగమదియుఁ;
దాపమై పరితాపమై తనరుచుండు,
బుద్ధి తగ్గియుండఁగ మీఱి, పొంగి, జాఱు.
చాలు! ధైర్యముగొను, మింకఁ జాలు నీదు
మున్నుమాట. ఎందేనియు మునిఁగి యుక్కు

మడఁగునఁట! యేటికో యిట్టి కడిఁదిపట్టు!
నీకు మిత్రుఁడనై యుంట కీకొనంగ
నిరువురకు బంధన మ్మయశ్శృంఖలమ్మ
యేర్పడియె, నీదు వాంఛలఁ గూర్పఁ దీర్ప;
ఇయ్యదన మేలని యెఱుఁగుమయ్య; యింకఁ
జచ్చుకత తలపెట్టక సంచినిండ
రొక్కములు లెస్స నింపి శూరుండ వగుచు
రమ్ము నా వెంట; దొడ్డగడ్డమ్ము దాల్చి
రూపు మార్చుము — సంచిలో రొక్కములను
మఱవఁబోకు! దశదమాన నెఱపఁగలదె
మూఁడు నెలలేని తన ప్రేమ మూరుపైని? —
రొక్కములు ముఖ్యమన్న! మూరుండు నేని
ఆ పెపై వలపున కంటె యతుకఁ బోఁడు;
ఎద్దియూక స్త్రీక మద్ది యీాల్గు నట్లె —
మఱవకుమ సంచిరొక్కమ్ము మాత్రమీావు!
మూరుజాతుల చిత్తముల్ మాఱుచుండు —
రుద్రగా! సంచి నెఱియంగ రొక్కము సుమి!
అతని కిప్పుడు మల్గోవయట్లు మధుర
మైన ఫలమది ముసిఁడికాయయును బోలెఁ
గటికిచేఁదుగ, విసముగఁ, గ్రాలఁబోదె?

ఆకె మూరునిపైఁ దనయాస దీఱఁ
దనివిగాంచక మదిఁ దన తప్పెఱింగి
యీడు జోడుగ జవ్వనమే వరించు —
నించుమా లెస్స రొక్కములన్ సంచినిండ!
క్రుంగవలయున యేని మునుంగ నేల,
మేలు వితమును గని యత్తమిల్ల రాదె?
చేర్పఁగల రొక్కమెల్లను సేకరించు!
నేరు పెఱుఁగని ద్రిమ్మరి మూరునకును
నేర్చిపేర్చిన యట్టి వెనీసు జాణ
దశదమాస కేర్పడిన బంధమ్ము నాదు
తెలివిదేటలకును బన్నికలకు లొగ్గు
నేని, నీకబ్బదే యల్లచాన? కాన,
రొట్టె నేతఁబఱను జుమ్ము రొక్కమున్న!
ఓయి! నీ మునుంగుట ముక్కలాయె! దాని
మఱియుఁ దలపోయకు; మునింగి మగువలేక
తెగుటకన్న నీ కోరికి తీర్చికొనఁగఁ
గడఁగి యురిదీయఁబడుటయు ఘనము సుమ్ము.

రుద్ర. పట్టువిడువక నన్నుఁ జేపట్టఁగలవె
నమ్మి యీ కార్యమున సకలమ్ము నిలుప?

అయా. సంశయము విడు నాపట్ల — సంచినిండ

రొక్కములు! రొక్కములు నించు లెక్కలేక!
తెల్పితిని బలుమఱు, మఱి తెల్పవలెనె
మూరునెడ నాకుఁ గల పగ కారణమ్ము?
పదిలపఱిచితి దాని నా హృదయమందు;
స్వల్పమె నెపమ్ము నీదు ద్వేషమ్మునకును?
కాన, మన మిర్వురము గూడి కంటు దీర్చి
కొనఁ గడఁగవలె; నాతని వనిత నీవు
హత్తి యరిసెము నంద నా కాట యలరు.
కాలగర్భవాసము నందుఁ గలవు హెచ్చు
కర్జములు, నాళులు సనంగఁ గానవచ్చుఁ;
గాన, గిఱుకునఁ బొమ్ము; రొక్కమ్ము సంచి
నెఱయ నింపు; ముదయమున మఱియు మాట
లాడుదము; సాయ మాను దయ్యమ్ము, నమ్ము!

రుద్ర. ఉదయమున నేడఁ గూడంగ నొప్పు మనకు?

అయా. నా బసనె.

రుద్ర. పెందలాడ నిస్గలియు వాఁడ.

అయా. మేలగుం బొమ్ము! జ్ఞాపకమే, యనుంగ!

రుద్ర. ఏమి?

అయా. తలపెట్టను మునింగి ఘులుగు టెంక!
వింటివా?

రుద్ర. వింటి, మది మార్చికొంటి; నిపుడు
వేగఁ జని నాదు సేలలు విలువవలయు.

[రుద్రగుఁడు నిష్క్రమించును.

అయా. ఇట్టులియ్యబ్బ కానిఁ జేపట్టి యతని
విత్తమెల్ల నాకర్షించి వేడ్కఁ జెందుఁ
గాక, లాబము లేకలవోకఁ జూచు
కోకయాగుఁడు నియ్యవివేకితోడఁ
బ్రొద్దు పుచ్చుటకును బిచ్చిబొప్పెడొక్కొ ?
ద్వేషము నిజమ్ము మూరుని దెసను నాకు;
దీనికిం దోడుగాను నా పానుపయి
నాదు వ్యాపార మాతఁడొనర్చె ననుచుఁ
గల్గెను బ్రవాద; మద్దాని కల తెఱంగు
తెలియఁజాలన కాని, సందియమె నిశ్చ
యమ్ముగాఁ గొని నాదు కార్యమ్ము గందు.
ఎట్టులున్నవి స్థితిగతు, లెంచి చూడ
నొప్పు. — మూరున కేను బ్రియుండ నగుదు,
అదియు నా పన్నికకు సహాయమ్ము గూర్చు;
కాస్యునిం గన నతఁడందగాఁడు, మేలె
యా నిదియు; వాని పనిగెల్చి, యటను జెట్ట
రెట్టికొన నిర్వారను గూల్చు — లెట్టు, లెట్టు!

ఏది వివరము? — సరి సరి! యెఱుక పడియెఁ;
గొన్ని నాళ్లు సెల్లిన వెన్కఁ గోవు దెలిసి
అథిలు చెవి నంటఁ జేయుదు నతని యాలి
తోడఁ గాన్యుఁడు చెల్మిఁ బల్కాడుచుంట.
ఇతని చూపులు నునురూపు నింతులమది
వలపు గొల్పఁ జాలునయని తలఁపఁజెల్లు;
మూరుఁడును గల్ల కపటమ్ము నేరఁ; డతఁడు
వెలికి విశ్వాసనీయులై వెలయు వారి
మంచి వారిగ భావించి సంచరించుఁ;
గాన, నతని నల్లనఁ గాలిగానిఁ బోలె
ముక్కువట్టి యీడిచికొని పోవఁగూడు.
వహ్వారే! బీజ మమరె! ఈపైన నారక
కమ్ము నిసియుఁ దోడ్పడఁగ వృక్షమ్ము దనరు.

[నిష్క్రమించును.

---

ప్రథమాంకము సంపూర్ణము.

---

# ప్రథమసంధి. *

——:0:——

ప్రవేశము :—సూత్రధారుఁడు.

ద్వి॥ కంటిరా, జనులార ! కలుషాత్ముఁడెట్లు
ఒంటిపాటునవేళ యోజించుకొనును ?
నరజన్మమెత్తిన నక్తంచరుండు
అరయు నెల్లప్పు డయోగుండు తనదు
దుర్భాగమునకు బల్ ప్రోవలు ; చిత్త
నైర్మల్య మెఱుఁగఁడు, నర్మిలి సున్న,
అక్కటికము గనఁ ; డాతని మదికిఁ
దక్కువారల పరితాపమ్మె పెద్ద
పండువు ; వెలికి నెపమ్ములు వెదకు
చుండును, దన దురుద్యోగమ్ము దిట్ట
పఱుపఁగాఁగోరి, యాపాతకుఁ డెపుడు ;
ఒరుల శ్రీవికి శేవ కొఱలుచు నుండు ;
ఇట్టి పెక్ బూత మయ్యింతిని మగనిఁ
బట్టె, నెట్టులు వారు వర్ధిల్లఁగలరొ !
ప్రారబ్ధ మొక్క ప్రోవను సిద్ధుచుండ
నేరికి సాధ్యమా నెఱిఁగి వర్తింప ?

* నాటక ప్రదర్శనమున దీనిని వదలి వేయవచ్చును.

తలవ్రాలు తప్పదట్ దబ్బు దబ్బఆయె ?
తెలియునే యేది యేతీరు రాఁ గలదో ?
ఆ రేయి సైప్రస్సు యాత్ర లేకున్న
మూరుఖుం దనవంశమును దెల్పుకొన్న
నాయనం దనయు దీనత వేడికొన్నఁ
ద్రోయ కాతండు కూతుం జేర్చికొన్న
భావముల్ వేఱుగాఁ బచరింపకున్న
నేవిధమౌనని యెన్నంగ నేల ?
అయ్యను దైవతమ్ముని ప్రేమఁ గనెడి
తొయ్యలి మొఱపల్కుతో హృదయమ్ము
ప్రయ్యలై శాపమ్ము వల్కెఁ దండ్రియును ;
అయ్యయో ! విపరీతమయ్యెఁగా ! నోట
జాఱినమాటయు శాపమ్మె ? ముందు
ఘోరమ్ము సూచించు గురువాక్కు గాదో ?

* * *

అంత నా తండ్రి గృహమ్మున కరిగె
స్వాంతమ్ము నందు విషాదమ్ము మీఱె
కోపాగ్నిఁ గ్రాఁగి పొంగుచుఁ బొర్లుచును స
మీపమ్మునందున మృత్యువుం దెలుప ;

అనుజు గరస్యేను నందగాఁ గొనుచుఁ
దనయ శయ్యాగృహాంతరమునఁ జొచ్చి
కన్నీరు జొటజొటఁ గార్చుచుఁ జూచె
వన్నెవన్నెల విల్వావలువలు, నగలు,
పుస్తకమ్ములు, వాద్యములు, పెట్టెలును ; — స
మస్తమ్ము, చూపుమా మాయమ్మ ననియె,
తమ్ముఁడా ! యివి యెల్లఁ దన వెంటఁ గొంచుఁ
బొమ్మని యిచ్చిరా పొ — మ్మని పలికి
తనదు శయ్యకతండు దడదడ సనియె ;
వెనువెంట రానున్న వితమేరు గనిరి ?
ఆరేయి వెడలిరి యథిలుండుఁ గాన్యుఁ
డారడం బొప్ప ; నయాగుండు నేఁగె
నుదయమం ; దాతని యోడలో నరిగె
ముదిత దశదమాన మోదంబుతోడ,
జనకునిదయ వెయిసార్లెన్నికొనుచుఁ,
గనలువోనని గట్టిగా నమ్మికొనుచు.
పాప మా వృద్ధుండు పడ్డదే పడక !
ఆపొద్దు మునిమాప యధిపుఁడు మంత్రు
లనుజుఁడు బందుగు లందఱు దుఃఖ
మును నిల్పలేక గుంపుగఁ బజ్జచుట్టుఁ

జేరిరి ; గుండెలు చెదరెడు నట్లు
తారిచెఁ జూడ్కు లందఱపయి నతఁడు ;
వ్రేలితోఁ దమ్ముని బిలిచి హీనస్వ
రాల నడ్గెను గుమార్తయు నేఁగెనో యని.
ఔననఁ దనయుఁడు ఱట్టె తొఱంగె,
భానుండు పశ్చిమవార్ధి మునింగె.

*　　　　*　　　　*

పురమెల్లఁ జీకటుల్ పొదలనీ శోక
మురవడిఁ బఱచె నొక్కొక్క యింటికిని ;
ఆకసమ్మును దుఃఖముం దమఁ దెంపు
లేక వర్షించి పొర్లించెను నీరు ;
సుడిగాడ్పు కెరలి వసుంధరఁ ద్రిప్పి
వడుపున నెగడి సైప్రస్సుకై నూకె.
వెనిసు నావల కేమి వెఱ, పితుపాను
మునుక వేయించునపో యని పల్క ;
గిట్టిచెట్టులు తప్పుపెట్టులు, వేల్పు
పట్టి దశదమూనఁ బ్రగ్గడలెల్ల
సభగూడి తేఁడును సాయమ్ముగాఁగ
అభయమ్ము వేఁడిన యయ్యను ద్రోసి

చెనఁటి మూరునిపాలుసేయరే, దాని
కిని శిక్షయిఁదని పల్కిరి జనులెల్ల ;
అయ్యయ్యో ! ఘనుఁడు కన్నయ యంతరించె,
వెయ్యేల, బిడ్డను విధియ ముగించు,
వెనినురాజ్యము కీర్తి వెస నస్తమించు,
అనుభావ్యమాగునే యధిపులే యయిన ? —
ఈ మొగి వచియించి రే మూలఁ గనిన ;
ఏమాయలును మందు లేమియు లేక
ముద్దియ మూరుని మోహించుటెట్టు
లద్దిరా పోరున కరుగుటెట్లనిరి ;
ముక్కుపైఁ దర్జని మోపి రెల్లరును,
అక్కట కట ! యని రతివలు మగలు ;
అంతలో నా దుఃఖ మాగ్రహంబయ్యె,
వింతవార్తలు గూడ వెలికి రానయ్యె.
మూరుండు యోగ్యుండెపో ! చాటుమాటు
గా రాత్రివేళ, నొకానొక ప్రొద్దు
పగటివేళ, నయాగు పడఁతి యామిలి య
రుగుటయుఁ గనరె మూరుని స్థానమునకు ?
ఇరువురు ముప్పురు నేవురు నిట్టి
పరమ రహస్యమ్ము బయటికిఁ దెచ్చి ;

రెంచకున్నంతనే యెవ్వారి గొప్ప,
యెంచిచూచినఁ గంతలెన్నొ చూపట్టు;
వశమె యాథార్థ్యమేర్పఱుప, యామిలియు
దశదమానను గనఁ దలచుగ సనదె ?
ఏమి మచ్చులుమందు లిచ్చెనో మూరుఁ
డేమేమి యంపెనో యెవ్వరు కనిరి ?
ఆనడిరేయిని యామిలి దశద
మానకుఁ దోడుండె మనుకువనుండి
యని తెల్పె నొకపల్లెఁ డాశ్చర్య మొదవ;
విన విన వింతలు వెలియగుచుండె.
మూరునిదెస దోసమును లేశమేని
నేరరు నమ్మంగ నృపుఁడు ప్రెగ్గడలు;
కాని, యీవార్తలు ఘనమయి పర్వఁ
గా నోలగము గూడి — కడుఁ దత్తరమునఁ
దీరుమానించి యింతినిఁ బంపినార
మారేయి; మేల్గాదె యటుగాకయున్న ?
జనఘోష మిపుడు విస్తారమై చెలఁగెఁ;
గనరా దణంచు మార్గమొకండు తక్క;
ఈ ప్రళయానిల మ్మెట్టులేఁ గడచి
సైప్రస్సునను బ్రవేశము గన్న వార్త

అధిలుండు తెల్పిన యా నిముసమ్మె
ప్రథమకార్యమ్ముగ భావించి, యతని
మరలి రమ్మని వర్తమానమ్ము నంపి
అరయనొప్పాను విషయములెల్లఁ జక్క ;
ఈ కర్జమును గరస్యోనుండు లాద
వీకుండు సని నెఱవేర్పఁగావలయు ;
దశదమానను విహితముగఁ బిన్నయ్యా
వశము సేయగఁబంచి, వచ్చినపిదప
ముందటి తీర్మానమును ద్రిప్పి వేసి
అందఱకును దృప్తియగురీతి మఱి వి
చారణ సల్పుటే సర్వోత్తమమ్ము ;
మూరుండు దీని నొప్పానుగాని తప్పఁ —
డని యిట్లు తమ నిశ్చయము తేఁటఁబ్రవడ
లును జేసికొనిరి ; వేల్పుల కెల్లవారు
మొక్కులు సెల్లించి మునురు పోవంగ
నెక్కుడు సంతోషమే యెన్ననైరి.

* * *

అన్నలార ! వెనీసుపురమున వార్త
యున్న తెన్నెఱిఁగించి యున్నాఁడ ; దీని

మఱచుచు మున్గల మల్లడిఁ గనుఁడు.
సరజస్థమున వీపునం జూపు గలదె?
ఎట్టి దొడ్డబ్రదుకు నిరుప్రక్కలఁ గన
బుట్టుగ్రుడ్డుల చందమునఁ గ్రాలుచుండు;
మేటి సుకమ్ములు మేలు వేడుకలు
కాటియందలి పండుగల్ గాఁ జెలంగు.
వనధిపై దుడుకుఁదుపానునఁ బడిన
వెనిసునావల గతి వినవలె నింక;
సైప్రస్సు యాత్ర పక్షము పయనమ్ము
ఈ ప్రళయమ్మున నిమ్మడి వేగ
మడరి వారములోన నా యోడలెల్లఁ
జెడిదిఁ జెందక యొడ్డు సేరినట్లయినఁ,
బగతుర కలములు ప్రయ్యలై మునిఁగి
తెగటాఱినను గడింది విచిత్రము గద?
ఏదెట్టులయ్యెనో యేఁ జెప్ప నేల,
మీదు సన్నిధిని నిమేషమ్ములోన
ఈ వర్తమానమ్ము లెల్ల స్పష్టమగుఁ
గావున సెలవొసంగఁగ వేఁడికొందు.

* * *

అక్కటకటకట ! అథిలుని యోఢ
యెక్కయివడిఁ బయికెగసి మిన్నంటి
పాతాళలోకముం బట్టుచు లేచు
చేతెఱఁగున్నదో యీక్షించరయ్య !
కానరా, దయ్యయో, కాస్యుని యోఢ !
సేనాని యథిలుని చిత్తమునందు
వంత యింతింతని వక్కాణమేల ?
వింత వివాహమ్ము వేడుకల్ విధియె
తొలఁగించెఁగా యని తోఁచె నాతనికి ;
విలపించు నతఁ డింతి వేమఱు దలఁచి ;
తమ సుఖమ్మును గోరి తప్పఁద్రోవంటి
నిముసమ్ములోఁ దండ్రిని దుఃఖవార్ధి
ముంచిన పాతకమ్ము హరించి పోనె
ముంచక మమ్ముల మున్నిటిలోన ? —
అని తలంచి తలంచి యతఁ డంగలార్చు ;
మునుఁగునో బ్రదుకునో మఱఁగనవలయు.
ఈ విపత్తులు దైవకృపమెయిఁ గడచి
ఠీవిఁగాంచుట యెంతటి మహేంద్ర పదవి ! —
సంతోసమెచ్చి మూర్ఛయుఁ గల్గకున్నె ?
అంతయు మీ కన్నులారఁ గనుండు !



# ద్వితీయాంకము.

——:0:——

రంగము ౧. —సైప్రసు దీవిలో నొక రేవుపట్టణము ;
ఓడరేవు సామీప్యమున బయలు.

ప్రవేశము :—మంతనుఁడు, ఇద్దఱు పౌరులు.

---

మంత. తే॥ అగ్రమునఁ గను దవ్వుల కరిగియుంటి ;
ఇచట మీ కేమి కన్పట్టె నంబుధిపయి ?

౧ పౌ. కానరా దేమియును ; నలిఁ గనలి పోటి
కుప్ప పైకెగసెడి మింటిఁ గొట్టునట్లు ;
చూడఁబడ దేడ నొక చాఁప జాడ యేని.

మంత. ప్రళయమారుత మొప్పె నీ వారమెల్ల ;
వింతగాఁ గట్టడమ్ము లుర్విపయి వడఁకె ;
మేటి యోడలు నేని మున్నీటిపైన
నిలువఁజాలునె ? నగములై నెగడి విఱిగి
పడు తరంగల తాఁకుల బ్రద్దలగుచుఁ
జిదురలై నలుదెసలకుఁ జెదర కున్నె ?
ఎట్టి వార్తలు విందుమో యిందు మనము ?

౨ పౌ. ఉ॥ వార్తయొకండ విందు; మది వైరితురుష్క
నియోడదండు సం* వర్త మరుత్ప్రహార పరిపం
థికి నోడుచుం దోడు వీడి వే * ర్వోర్తెరఁగుల్ ప
లాయనము పెంచి వికావిక లౌట; — చూడుఁ
డా* వర్త మహాగ్రహమ్ము లలవాఁగులు ఫేనము
గ్రక్కుచందముస్!

కం॥ పెనుగాడ్పురాతు పోటున
కునుదూఅున కలిగి జ్వాల్ నిగుడ్చుచుఁ గరముల్
ఘనపథముఁ దన్ని పైకుమి
యును దిక్కుల వెల్గులార్చు నుద్యోగమునన్.

తే॥ కడలియం దిట్టిక్షోభంబు కనియు వినియు
నెఱుఁగ; మిద్దాని పంట యింకరయవలయు.

మంత. అల తురుష్కుల కలము లెందైన లేవు
నంపు రక్షుణఁ గనకున్న సంద్రమునకు
నర్పణము; యించుకయు సంశయమ్ము లేదు;
ఇట్టి కసురున నిలుచుట వట్టిమాట.

ప్రవేశము:—3 - వ పౌరుఁడు.

3 పౌ. చిఱుతలార! సువార్తఁ దెచ్చితిని, వినుఁడు! —
ముగిసెనయ్యా కయ్యమ్ములు పోరు లన్ని;
శత్రువుల యత్నమెల్ల నిష్ఫలమ యయ్యె,

వారి యోడ లిప్పెను గాఢపు బాధ నెమ్మది
లేక తల క్రిందులై కడలిని మునింగి
యంతరించుట గాంచిన యట్టి వెనిసు
నావ యిదె వచ్చియున్నది రేవునందు.

మంత. మద్దురే! యీసువార్త నిక్కమ్ము గాదె ?

3 పౌ. సందియమ్మేల? యీ నావయందు వచ్చి
నాఁడు, సుందరాంగిని వెంటఁ దోడుకొనుచు,
కాస్యోఁడను యువసేనాని; ఘనుఁ డథిలుఁడు,
దండనాథుఁడు, ప్రతినిధిస్థానమునకు
నియమితుఁడు, రాఁ గలండఁట నేఁడొ రేపొ.

మంత. అతఁడు వచ్చిన నాకు నానంద మొసఁగు ;
తగిన నాయకుఁ డిట్టి తరుణమునకు.

3 పౌ. భద్రముగ నీశ్వరుఁడు కాపాడవలయు !
కడలియందుఁ దురుష్కుల కలము లెల్ల
మునిఁగెనని వార్త తెల్పి యుప్పొంగునట్టి
కాస్యోఁడ యల ఘనుని రక్షణము కొఱకు
దైవమునకు మ్రొక్కుచును మోదముఁ గొఱంగి
యున్నవాఁడు ; తోడుగ వచ్చునోడ లీతు
ఫాను ప్రత్యుగ్రతచే జంటఁ బాసెనంట.

మంత. అథిలునకు దేవతారక్ష యమరుఁగాత !

మంత. అతని దండ నుండినవాఁడ నాలమందు,
మేటి యోధులు నతనికి సాటిగారు ;
రంకు పోవుద మబ్ధితీరమున, కిపుడు
వచ్చియున్న వారినిఁ గని వార్త లెఱుఁగ
వచ్చు, నధీలుని యోడకై వనధిమీఁద
సూక్షుదృష్టి నిగుడ్చుచుఁ జూడవచ్చు.
3 పౌ. రంకు! ప్రతి నిమేషముఁ గ్రొత్త రాకలొప్పు.

ప్రవేశము:—కాన్యుఁడు.

కాన్యు. వాసిఁగనరయ్య! సైప్రసు వాసులార!
మూరునకు సేమమును గోరు వీరులార!
మింటఁగల వేల్పులెల్ల నా మేటి మగని
భద్రముగఁ గాంత్రుతు గావుత! వార్ధిపైనఁ
బ్రళయమారుత మే యెడఁ బాపె మమ్ము.
మంత. నావ దృఢమైనదే కద ?
కాన్యు. చేవ ప్రాను ;
గట్టియందుక్కుఁ బోలు! బల్ దిట్ట యాను
నావికుండును ; ఈ కారణమ్ము లెంచ
మది నధైర్యమ్ము వీడి సేమమ్ముతోఁచి
క్రుంగి యున్న నా యాస లుప్పొంగఁ దొడఁగు.

[తెఱలో 'నావ, నావ, నావ' యని కేకలు.

ప్రవేశము :—౪ - వ పౌరుఁడు.

కాస్యు. ఏమి ధ్వనియది ?

౪ పౌ. కం॥ పురమున లేదొకప్రాణియుఁ ;
గరమరుదుగ జనములెల్లఁ గడలికడకుఁ బా
ఱి రహిం జెలంగ నిలిచి నా
రు లేవుదరి ; నఱచువా రరుసమున నిటులన్.

కాస్యు. తే॥ అఖిలనాథుని నావయే యని తలంతు.

[పిరంగులు వినఁబడును.

౨ పౌ. స్వాగతము తెల్పినారు ; నిశ్చయము హితుల
యోడ యౌనది.

కాస్యు. అయ్యొ ! నీనాడ కేగి
తెలిసికొని రమ్ము.

౨ పౌ. చిత్త, మిదే క్షణమ్ము ! [నిష్క్ర.

మంత. ప్రౌఢ మీనాయకుఁడు పెండ్లియాడినాఁడొ ?

కాస్యు. అతని కబ్బిన భాగ్య మత్యద్భుతంబు.

మ॥ ఫణికింగల్గిన వేయినోళ్లు వివరింపన్నేరునే యా
సతీ*మణి సౌందర్యము సద్గుణమ్ములు నసామ్యాం
బైన సౌశీల్యమున్ ? * గణుతింపన్గథలందుఁ బ్రా
ణకవులుం గల్పింపలే రట్టిద్రో * రణి; చిత్రమ్ముల
యందు లేఖకు లమర్పంజాల రావైఖరిన్.

ప్రవేశము : ౨ - వ పౌరుఁడు.

తే॥ ఏమి? ఆవచ్చియున్నవా రెవ్వరైరి?

౨ పౌ. అతఁ డయోగుఁడ; అఖిలుని యనుచరుండు.

కాన్యు. మ॥ కడువేగమ్మున వచ్చినాఁ, డతనిభాగ్యమ్మెట్టు
లెన్నందగుఁ? * సుమలుఁ రేగినవాఁగులుఁ
బెనుఁదుపానుల్ నీటిలో గుట్టలుఁ * నడు సం
ద్రమ్మున నోడపై దశదమానాదేవతం గాంచు
చుఁ * విడిచెంబో తమ దుస్స్వభావములు సం
ప్రీతిఁ నతుల్ సేయుచుఁ.

మంత. తే॥ ఈ భువనమోహినీదేవి యెవ్వరయ్య?

కాన్యు. చం॥ నలువప్రసాద, మాపె మననాయకు నా
యకురాలు, వెన్కరా * వలసి అయోగు వెం
బడిని వచ్చె; విచిత్రమెసంగ నేడె నా * ఖలఁ
బయనమ్ము మూఁడె. — అఖిలుం దరిఁ జేర్పుము,
దేవ! ఓ మహా * నిల! వెస నీదు శ్వాసమున
నింపుమ యాతని యోడచాఁపలఁ.

తే॥ మింట వసియించు నోయనిమేషులార!
అఖిలనాథునిఁ గాపాడి యతివ దశద
మాన కరబంధనముల ప్రేమమున నిల్పి
కొల్పరయ్య మాయందఱకును ముదంబు.

ప్రవేశము:— దళదమాన, యామిలి, అయాగుఁడు, రుద్రగుఁడు, సేవకులు.

కాస్యు. బాపురే! నావ తెచ్చిన భాగ్యలక్ష్మి
రేవునకు వచ్చె, దృష్టింపరే ముదమున!
సైప్రసునివాసులార! తక్షణము నేల
మోకఱిల్లుచు నాపెకు మ్రొక్కరయ్య! —
రాణి! స్వాగతమమ్మ! భద్రముగ మీకు
నలుగడల దేవతలరక్ష వెలయుఁగాత!

దళ. వందనము, కాస్య! నాథుని వర్తమాన
మేమి తెల్పెదు?

కాస్యు. అమ్మ! నే నెఱుఁగువరకు
నాయకుని సేమమునకు బన్నమ్ము లేదు;
వైళమే వచ్చునని యెన్నువాఁడనమ్మ.

దళ. కొంకుత్రోఁచెడినయ్య! మీకు జత వీడఁ
గారణమ్మేమి?

కాస్యు. జలధి యాకసముతోడ
ఘోరుమని పోరి మమ్ముల వేఱుచేసె.—

[తెఱలో 'నావ, నావ' యని కేకలు, ఫిరంగుల ధ్వనులు.]

అల్లదిగో నావయఁట!

౨ పౌ. మిత్రుమాట నిజము;
స్వాగతము తెల్పినా, రటకేఁగి వార్త

యొఱుఁగఁగా నగు.

కాన్య. వేవేగ నరసిరమ్మ.— [అపా. నిష్క్ర-.

కుశలమె, అయాఁగ!— యామిలీ, కుశలమమ్మ!—
సందియముఁ జెందకోయి నీ డెందమందు,
నీదు సుందరి మెచ్చుచు స్నేహమెసఁగఁ
జనవుమై నుంచువాఁడ నీసరసముద్ర.—

[యామిలిని ముద్దుగొనును.

అయా. అయ్య! నా కనుదిన మబ్బున యాపె జిహ్వ;
అంత యోష్ఠము గొంటివే నధికమగును!

దశ. వట్టినింద! ఆపెకు నోటఁ బలుకె లేదు.

అయా. నంగనాచిగదమ్మ! యీ నాతి నోటఁ
బెద్దపల్కులె వెడలు నేప్రొద్దు, నిజము;
నిద్దురకు సెలవొసఁగిన నిముసమంద
సద్దుసేయకయుండు నీ సరసురాలు;
అమ్మ! మీ ప్రమోాల నీపె నాల్కడఁగిమడఁగి
చిత్తమందె నన్నాడిపోసి కొనుచుండి
ఒంటిపాటున నాప్రాణ ముమ్మలించు.

యామి. ఇట్టు లెగ్గాడఁగాఁ గతమేమి కల్గె?

అయా. క్రొత్తగాఁ గల్గవలయునే, గోల! మీాది
పుట్టువెట్టిది? మీా నైజ మెట్టిదమ్మ!

ఉ॥ చిత్తరు బొమ్మల ట్లెదురుసెప్పక యొప్పెదు రిల్లు
దాఁటినక్, * మెత్తని పల్కులక్ సఖుల మెప్పు
లఁగాంతురు, వంటయింట వా * యెత్తుదు, రా
దలంబడుకటింటను మొత్తదు, రెగ్గుఁజూచి వా*
క్రుత్తురు లాపుసేతినుడుగుల్, పగ గాములు, మీా
రు యామిలీ!

దశ. గీ॥ చాలుఁజాలును వట్టి దూషకుఁడ వీవు.

అయూ. అమ్మరో! ననుఁ దెగడ న్యాయమ్ముకాదు ;—
యామిలీ! నీవె పల్కు వ్యత్యాసమున్నఁ —
బనులవేళల నాటలఁ బ్రొలుమాలి,
పడుకటింటన కాదె మీా పనుల జోక?

యామి. నా నుతులుగూర్ప నిను వేఁడఁబోను లెమ్ము.

అయూ. వాలుఁగంటి! ఆ యెన్నిక మేలె నుమ్ము.

దశ. ఏది, చూతము! నా నుతు లెట్లుకూర్తు?

అయూ. అమ్మ! ఆ పని నేమింపకమ్మ నాకు,
వంకలెన్నుట నా స్వభావమునఁ దలుచు.

దశ. అయిన నేమయ్యె? తోఁచినయట్లు పలుకు.—
అరిగిరే రేవునకు?—

అయూ.                                    దేవి! యరిగినారు.

దశ. పాళిఁ గనఁజాల మనమున; అయ్యొ, వేడ్కఁ

బూని ముచ్చటలను బ్రొద్దు పుచ్చవలయు.—
తెల్పు మేరీతి నన్ను నుతింపఁ గలవు ?

అయా. ఇదిగో! వచ్చితి వచ్చితి నీక్షణంబ;
గొంగళినిఁ బట్టికొన్నట్టి గోజుపోల్కి
నా కయిత నాదు బుఱ్ఱలోనఁ గల గుంజు
గుంజికొనుచు వెల్వడును! పల్కులవెలంది
జివ్హపై నిల్చి యిట్లు వచించునమ్మ!

ఉత్సాహము॥ చక్కఁదనము తెల్విగూడి చానకుఁ
ఘటిల్లినన్ * దక్కఁజేయు సుఖముఁ జక్కఁదన
మువలనఁ దెల్వియున్.

దశ. తే॥ లెస్స వల్కితి, వందమ్ము లేక తెల్వి
యొప్పుచానకు నేతీరు మెప్పుగలదు ?

అయా. ఉత్సాహము॥ చక్కఁదనము లేక తెల్వి చానకున్
ఘటిల్లినన్ * జక్కనయ్య నెకనిఁ గూర్చి సౌఖ్య
మొసఁగుఁ దెల్వియున్.

దశ. తే॥ తచ్చనపు మెచ్చయిది!

యామి. చక్కఁదనము గల్గి
తెల్వి యొప్పని తెఱవకే తెఱఁగు మెప్పు ?

అయా. ఉత్సాహము॥ క్షితి వివేకహీన గలదె చెల్వమొ
ప్పు చెలియలన్ ? * సుతునిఁ బడయదే వివేక

శూన్యతన్ జరించిరన్ ?

దశ. తే॥ అల్పజనములకు ముదమ్ముఁ గొల్పునట్టి
ప్రాత పరియాచకములివి ; వంటపూటి
యిండ్లఁ గల్లంగడుల వెలయించుచుంద్రు ;
చాలు ! నీ మెప్పుఁ బల్కులు చాలు ; నింక
జక్కఁదనమును దెల్పియు సన్నమైన
నెలఁత నెంతహీనముగ వర్ణింపఁ గలవో !

అయా. ఉత్సాహము॥ సతికిఁ జక్కఁదనము తెల్పి సన్న
మైన నేమి ? ధీ * మతులు రూపవతు లొనర్చు
మనకపనులె సల్పెడిన్.

దశ. తే॥ ఒచ్చెల ! యిదేటి యజ్ఞాస, మచ్చికమున
కెచ్చు మెచ్చొసంగితి ! వీఁక నీ సొలంగు
పొగడికల నందఁ గలదోయి, భూషణలకుఁ
దగినమగువ — భీతిలక నిందాపరులనె
సాక్షులను జేసికొనఁ జాలు సచ్చరిత్ర ?

అయా.— [మధ్యాక్కర].

ఏ చారునేత్ర సౌందర్యఖని గర్వ -
మించుక తాల్ప ;
దే చాను భాషింప నేర్చి మితభాష -
లే యిచ్చగించు ;

ఏచాన ధనవతి డంబువేషంబు -
లెన్నడు నొల్ల ;
ఏచేడె తరుణ మబ్బినను దన కోర్కె -
యీడేర్చి కొనదు ;
ఏ చెల్వ యాగ్రహాకారణము గల్గ -
నెదఁ బగఁ గోర ;
ఏ చిగురుంబోఁడి సదయ హృదయయై -
యొగ్గులు మఱచు ;
ఏ చారుమతి వివేకమ్మునఁ గొఱంత -
యిసుమంత కనదు ;
ఏ చెలి వెలివిందు లింటి కుడుపున -
కెచ్చని యనదు ;
ఏ చంద్రముఖి వివేచనము సల్పియు -
నెవరికిఁ దెల్ప ;
ఏ చిన్నెలాఁడి తఱ గోరు వరులఁ గ -
న్నెత్తి యీక్షింప ;
ఏ చాయ చిలుకలకొల్కి తగియుండు -

దశ. ఏకార్యమునకు ?

అయా. కాఁచిపోయం, గని పెంచఁ, నింటి లె -
క్కలు వ్రాసియుంచ.

దశ. తే॥ సారమొప్పని పర్యవసాన మయరయొ! —
యామిలీ! నేర్చికొనకుమీ, నీ మగడని
ఇతని విపరీత నీతులు హేళనములు.—
పల్కుమా, కాస్య! యితఁడు వాగ్వాదపరుఁడు,
నకట వికటపు నీతిబోధకుఁడుఁ గాఁడొ?

కాస్య. అమ్మ! మర్మము లేక మాటాడు నితఁడు;
నూటిగా మోటుగా నని చూడఁడమ్మ;
యోధుఁడే మెఱుంగును నీతిబోధ—యితఁడు
బనరములఁగూర్చియే చక్కఁ బల్కఁగలఁడు.

[కాస్యుఁడును దశదమానయు మాట్లాడుచు దవ్వుల కరుగుదురు.]

అయా. [తనలో] — చం॥ భళిర! సెబాసు, కాస్య! కయి వ
ట్టుచుఁ దోడ్కొనిపొమ్ము!— మేలు మేల్! * సలు
వుము ప్రీతిమై గుసగుసల్! — సగవుల్ చిగిరింప
వార్తలం * దెలుపుము! వహ్వారే! పెరిమె తేట
వడం బలుమాఱు నీదు ప్రవే * ళులకును ముద్దొ
సంగుము కడుఁ వినయమ్మున మోకరించుచున్!

శా॥ నీ మర్యాదలు నీదు మన్ననలు నీ సెయ్యంపుఁ బ
ల్కుల్, బలా * రే! మోదమ్ముఘటింపఁగుల్కొ
దవ యారీతిన్; సరే పొమ్ము! మూ * డే మూ
న్నాళుల లోపలంగనుము, నీ హీంహీంల హాహాలు

నా* సామర్థ్యమ్మునఁ జేతు, నీకొలువు — కాస్యా!
మిత్రమా! — కూలుతుర్ ! [తెలిలో బాఁకాధ్వని.

తే॥ — [బిగ్గరగా] అఖిలనాథుని బాఁకా! అహా రె యతఁడె!
ఆధ్వనియె స్పష్టముగఁ దెల్పు.

కాస్యు. ఔ! నతండె.

దళ. కలిసికొందము రమ్ము, స్వాగతమొసంగ.

కాస్యు. దేవి! ఆ దెస చూడు, మే తెంచె నతఁడ!

[ప్రవేశము:—అఖిలుఁడు, భటులు, సైప్రసు జనులు.

అఖి. నను జయించిన లావణ్యఖని! — [దళదమానకాఁగిటఁ బనుచు.

దళ. మ దఖిల!

అఖి. మ॥ కలలో నెన్నఁగ లేదు, నీదు మునురాకం గాంచి
నా యుల్లమం * దలవిందప్పిన తృప్తియుర్ సు
ఖము నాహ్లాదంబునుంగంటిఁ, బ్రా*ణలతాపో
షిణి! యిట్టి శాంతమె తుదిగ్ గద్దేని మేలందుభూ
* ప్రళయమ్మొప్పి కలమ్ము లాకసమునుం బాతా
ళముర్ ముట్టినర్.

మ॥ ఇపుడిప్పట్టున నాకుఁ బెన్నిదుర హాయింగూర్చు
నత్యంత; మూ * శ ప్రమాణమ్మును మీఱి చిత్త
మునకుర్ సంప్రీతి సంధిల్లె; నిం * కెపుడే నింత
టి సంతసమ్ముఁ గను టెంతే సంశయింతుర్. —

దశ. అవా * చ్యవుఁ బల్కేఁటికి, హెచ్చుఁగాత మన
సౌఖ్యప్రాప్తి నానాఁటికిన్ !

అఖి. తే॥ వేల్పులు ! తథాస్తటంచు దీవింపరయ్య !—
ప్రియసఖీ ! నేల్పుఁజాల నివ్వేళ నాదు
డెందమున నిండి పొర్లు నానంద మిట్టి
దనుచుం; ఇచ్చట [గాంచు] నదియస్తు గొనుట నోట
మాట రాకున్న యది. ఇట్లు — [ముద్దిడుకొనును]
మఱియునిట్లు
కలిసి మన ప్రేమములు వృద్ధిఁ గాంచుఁ గాత !

అయా. [తనలో] — అజ్జరే ! ప్రకృతి చక్కఁగా నమరియుంట
మృదుమధురగాన మొప్ప మీఱుచున్నగకును;
క్షణములోన నయాగ సజ్జనుఁడు దీని
భేదపఱిచి యపస్వరాల్ వెలయఁజేయు !

అఖి. రమ్య నగరున, కాన్తపి ప్రశాంతిఁ గోరు .—
మిత్రులార ! వింటిరె మన శత్రులెల్ల
మునిఁగి మడిసిరి మున్నట ; ముగిసెఁ బోరు,
లాలములు.— సేనమే, యన్నలార ! మిమ్ముఁ
జూచి చిరకాలమయ్యె.— నా జున్నగడ్డ !
పైప్రసున వారు నిన్నెలసముసఁ గాంచి
పెద్దగా గారవింతురు ; ప్రేమ మెంచు

వారి హృదయములందు; నా ప్రాణధనమ!
చిత్తమున సుఖమెక్కుడై మత్తు క్రమ్మి
వాకు తడఁబడుచున్న దిప్పగిది నాకు.—
అనుచర! అయాగ! రేవునకరిగి, యోడ
నుండి నా సరంజామెల్ల నొద్దఁ జేర్చి
నావకప్తానుఁ దోడ్కొని నగరునకును
రమ్ము వేవేగఁ; బరుపు మర్యాదలందు
ఘనుఁడు, మాననీయుండు, సజ్జనుఁ డతండు.—
రమ్ము, ప్రియసఖ!—అయ్యలార! మిముఁ గాంచి
క్షేమము నెఱింగి కడు సంతసిల్లినాఁడ.

[అఖిలుఁడు, దళదమాన, భటులు, జనులును నిష్క్రమింతురు.]

---

అయా. ఓడ రేవున కేఁగుచున్నాఁడ; నటకు
గడియలోపల వచ్చి నన్ గలిసికొమ్ము.

[రుద్రగుఁడు పోవుచున్నాడు.

ఇదిగో రుద్రగ! సాహస మెసఁగు నేని—
అల్పులకు మోహమావేశమైనయపుడు
దొడ్డవారల గొనములు తొడరునండ్రు;
గాన—నీమది ధైర్యమ్ము కలదయేని,
నాదు నుడి వినుమా! యువనాయకుండు
కోటయొద్దిపారామీఁద నేఁటిరాత్రి

ఉక్కణము నిల్చు; ఇపుడు నీకొక్కగుట్టు
తెల్పవలయు — దశదమాన తెన్ను లెన్న
అతనిపై నాపె కన్నిడినట్లు కాంచు.

రుద్ర. ఎబ్బె! అది యసంభవము!

అయా. ఇసీ! యిట్లు వాగు
మూసికొని చెప్పునది చెవి వేసికొనుము!
పలుకు మెట్టి విపరీతపు వలపు నూపి
ఆకె మూరుని వరియించె — అదియు నేటి,
కతని డబ్బులు, డాబులు, నతని లేత
లేత సొరకాయ కోఁతలుఁ, బ్రీతి మీఱ
నతఁడు నుడివిన డంబపు కతలు నమ్మి;
ఈ ప్రగల్భపుఁబల్కుల కింక నతని
మెచ్చి యాబోటి యాతని మీఁద వలపు
నిలుపునని నమ్మెదో? అటులఁ దలఁపవలదు;
సూక్ష్మబుద్ధిని యోజించి చూడు, మాపె
కంటి కాహార మావశ్యకమ్ము సుమ్ము!
కోఁతివిదయ్యముఁ గన నాపెకును ముదమ్ము
గలుగునెట్టులు? వలపున బులుపు తీఱి
మదనతాపమ్ము మందమై కుదిసినపుడు
క్రొత్తక్రొత్తున మత్తిఁ దళ్కొత్తఁజేయ,

ప్రాయము, సురూపమును, మృదువచనఫణితి
వలయుఁగాదె? మూరున కట్టివలను కలదె?
లేనిచో, నబ్బురమ్మె యీలేమ తనదు
తప్పు తెలియంగ, మది రోఁత దవిలి, మూరు
పేరు విన్నంతనే వాంతి వెడలు చంద
మేర్పడుట, ద్వేషభావము హెచ్చి క్రొత్త
కూరిమిని సమకూర్చుకోఁ గోర్కెఁ గనుట?
అయ్యొ! యియ్యది నిశ్చయ మందువుగద,
ఇంక సంశయ మేటికి నియ్యదనునఁ
గాన్యునకుఁగల భాగ్యము కలదెవనికి?
వయసువాఁ, డందగాఁడు, జవ్వనులమదుల
కింపుఁ దనరుచు సొంపుల నెసఁగువాఁడు;
పైకి నిర్మల హృదయునిభంగి నొప్పి
చిత్తమున దురాలోచనల్ సేయువాఁడు;
లేశమును బాపభీతియే లేనివాఁడు;
సమయమును గని తనదు దుష్టప్రయత్న
ములను నెఱవేర్చికొనెడి నేర్పుగలవాఁడు;
వంచకుఁడు, వేషధారి, బల్ పచ్చికాఁడు;
తక్కులాఁడు, విటరాయఁ, డాతనికి నీడు
జోడు బానిసకానినిఁ జూడలేము.

అతనిపై నిపుడిప్పుడ యీపె హృదయ
మంటియున్నది సుమ్ము; కన్గొంటె, బొమ్మ!

రుద్ర. సమ్మతింపఁగఁ జాల నా సాధ్వియందు
దోష లేశము; నాపెది దొడ్డ గుణము.

అయా. దొడ్డ గుణమేని, నీవాత గడ్డగొనుము!
చెడ్డ గుణమని పల్కు; మా చేత నిన్న
భక్ష్యభోజ్యము లంటదో పదుగురిబలె?
రుచు లెఱుంగదొ? గాలి మేయుచును నీరు
గ్రోలి యే మను నొకొ? దొడ్డ గుణమ యేని
మాఱుఁ గన్నంతనే మోహమునను దవిలి
అతని వెంబడి నుఱుకునే యన్ని విడిచి?
దొడ్డ గుణమున నెందేని పొడ్డు గనునె?
చూడలేదె కాస్యుని కయిల్తోడ నాపె
యాటలాడిన విధము?

రుద్ర. మర్యాద సూచ
కమ్మ యది.

అయా. వెఱ్ఱివాఁడవు, పొమ్ము! నిశ్చ
యమ్ముగన; మదిలోని భావమ్ముఁ దెల్పు
నన్న సుమ్ము; దుర్మార్గ ప్రచారమునకు
మత్రపీఠిక యని నమ్ముమా, సుమిత్ర!

నోటనోరిడి వారలు మాటలాడి
నపుడు పెదవులు తాఁకినయట్లు తోఁచె.
కాని తలఁపులు, రుద్రగ! వీని కెల్లఁ
బీఠికే ప్రధానము; దాని వెనుకఁ జల్ల
చల్లగా గ్రంథమే కొనసాగి ముగియు;
తూయనుచు మోమున నుమివేయవలయు!
కాని, యీ మాట లిపుడు పల్కఁగ నేల?
వెనిసు పురినుండి యింత దవ్వునకు నిన్ను
వెంటఁ దోడ్కొని వచ్చితి; విధియ నీకు
నా నుడులయందు గుఱి నిల్పి నా పనుపులు
సల్పి సంకల్పసిద్ధికి సాయమాట.
నేఁటిరాత్రి పారాలోన నిన్నుఁ జేర్తుఁ;
గాన్యూనకు నెట్టులేని నాగ్రహము గల్గు
నట్లు వర్తించు; మాతని యాజ్ఞ మీఱి
నడచుటో, దడబిడ గడబిడ లెసంగఁ
బల్కుటో, మఱి యేచొప్పు వాట మగునొ,
వలనెఱింగి ప్రవర్తిల్లవలయు; నిన్నుఁ
గాన్యూఁ డెఱుఁగఁడు, నేను దగ్గఱనె యుందు—

రుద్ర. అటుపయిన నేమి?

అయ్యా. ఏమిటా? అయ్యా! యతఁడు

ముక్కుకొనఁ గోపమునుదాల్చి నిక్కఁబోతు;
చేతి దుడుకునఁ గొట్టవచ్చినను వచ్చుఁ —
గొట్టినట్టి కోపమ్ము రగుల్ప వలయు —
అంతటను గందు విప్లవమందు నెంత
యల్లకల్లోలముగ జనులెల్ల బెదరి
కట్టు మీఱుచు నెల్లెడల్ చుట్టువారో ;
శాంతికై కాస్యు నుద్యోగ మంతముఁ గనుఁ;
బదపడి లభింపఁ గూడు నీ వాంఛితమ్ము ;
అడ్డు నిల్చిన దుష్టగ్రహమ్ము తొలఁగి
పోయినంత నీవు జయమ్ముఁ బొఱయు నెంత —
నిముసమున సమకూర్చు మార్గములు లేవె ?

రుద్ర. అదను గల్గింతువేనిఁ జేసెదను నీవు
చెప్పినట్టుల.

అయా. మేలుమేల్, చింత విడుము ;
వాని సామాను దింపించు పనికి నిపుడు
రేవునకుఁ బోవుచున్నాఁడ; రెండు మూడు
గడియలకుఁ గోటచెంత నన్ గలిసికొమ్ము ;
పొమ్ము ! విజయమ్మగును !

రుద్ర. వందనమ్ముఁ గొమ్ము ! — [నిష్క్ర.

అయా. కాస్యునకు నాపైపైఁ బ్రేమ కలదటంచు

నమ్మెదను ; గాన్యుపై నాపై నర్మిలిగొని
యున్నదని చెప్పి నమ్మింప నొప్పియుండు ;
మూరుదెస నాకు ద్వేషము పొదలుచుండుఁ
గాని, యాతఁ డుదారగుణానురక్తుఁ
డుత్తముఁ, డుదాత్తుఁ, డతులప్రేమోజ్జ్వలుండు,
నిశ్చలుఁడు, నిచ్చలుఁ బ్రియమ్ము నెఱపి దశద
మానకుంగూర్చు గాదిలిమగఁడ యగుచు
నొప్పఁగా నోపు. ఇంక నా చొప్పరయఁగ:
కలదు నాకు నయ్యింతిపై వలపొకింత —
అచ్చముగఁ గండకావరమని యుపేక్షఁ
దవిలి యుండఁగరాదు ; చిత్తమునఁ బాదు
కొన్నపగ పెల్లగిలి కాలకూటముబలె
నములుచున్నది నాయాత్మ, నిముస ముడుగ ;
దతఁడు నా సెజ్జపై వ్రాలెనని గుమాను
పొడమె, నామది నది యెట్లు విడిచిపోవు ?
సతికి సతి బాకి తీర్చికోఁజనును ; గాక
యున్న, నాతని కరగలి నొప్పఁజేసి
నిజమరయు తెన్నుఁగానక గిజగిజమని
తన్నుకొనుచుండఁ గాంచి సంతసము నంద
వలయు. ఇదియెంతపాటి ? — యీ పాడుఁదట్టు

కళ్లెము గ్రహించి పరువిడఁగలదయేని,
ముందుగాఁ గాస్యునింబట్టి బోరలగిలఁ
బండఁబెట్టుదు — అతఁడు నా పాన్పుమెట్టు
లేదని తలంచుచుంటి — ట్టేమీఁద నతని
గుఱిచి మూరునితోడ నెగ్గులను మెల్ల
మెల్లగా సమయముఁగని మిగులఁబిక్క—
పిచ్చియెత్తునయట్లు కాపించి, అయ్య
గారి పెండ్లిసౌఖ్యము మంటఁ గల్పఁగూడదు!
ఔ! నిటుల మేటి గార్దభమట్లుచేసి
నందులకు మూరుఁడు నన్ మెచ్చి వందనములు
సల్పి, నా యెడఁ గడుఁ బ్రేమ నిల్పఁగాక!
ఉన్న దిచ్చట [శిరస్సు] — స్పష్టమై యొప్పదిప్పుడు;
దుష్పథము రూపు తెలియుట ప్రయోక్తనపుడే.

[నిష్క్రమించును.]

---

రంగము ౨. — సైప్రస్సు, కోటనగరు ఎదుట.

ప్రవేశము:—దండోరావాఁడు, వానివెంటఁ బౌరులు.
ఆయావీధులలో ప్రకటన చాటింపఁబడును.

---

దండో. — హాజర్! హాజర్! హాజర్! ... మహాఘనత
వహించిన ధీరుఁడగు శ్రీ అఖిలనాయకుఁడు సం

8

త్సోప పూర్వకమ్ముగ నెల్లవారలకుఁ దెల్లమ్ముగఁ
దెలియపఱుచున దేమనః—మన శత్రువులగు
తురుష్కుల యోడదండెల్లఁ దుండుతుండుగ తు
నింగి మున్నీట మునింగి క్రుంగిన మేలువార్తలు
మొందుకొని వచ్చియుంటం జేసి, సైప్రసు నివాసు
లీయూసువిన్న తక్షణమ్ము విజయోల్లాసమ్ము రంజి
ల్లఁదమతమ యుల్లమ్ములకొప్పుచొప్పుల, నాటలు
పాటలు, చిందులు విందులు, రంతులు గంతులు,
నర్తనములు కీర్తనములు, దరువులు, మురువులు,
కేళులు కేళికలు, మేలములు పిసాళములు, నవ్వు
లాటలు చర్లాటలు, ఉయ్యాల లూగులాటలు,
చెండ్లు చిడుగుల్లు, పుణికిళ్లు త్రిప్పుళ్లు గొబ్బిళ్లు, గు
మ్మటమ్ములు మత్తాబులు మింటిబాణమ్ములు, ము
న్నగు వేడుకల క్రీడల యథేష్టముగ విహరించి పం
డువుఁగన ననుజ్ఞాతులు. ఇవ్విజయవార్తకుండో
డమ్మహనీయు నవీనపాణిగ్రహణ శోభనమహో
త్సవమ్మీరేయి నివ్వటిల్లుకతమ్మున సకలజనమ్ములు
సంతసమ్మునఁ బ్రొద్దుపుచ్చఁ బ్రార్థితులు. ఇపు డి
య్యయిదుగంటలవేళ మొదలు రాత్రి పదునొ
కండుదనుక నగరునం దయ్యయిప్రదేశములం గల

భక్ష్యభోజ్యమ్ముల విచ్చలవిడి విందారగించియు
దమిదృప్తిఁగనందగు. సైప్రసుదీవిని సంతోష
మ్ము వర్థిల్లుంగావుత! అఖిలనాయకున కఖండసౌ
ఖ్యమమరుంగావుత! ఒహో!........ [నిష్క్ర.

---

## రంగము 3.

### సైప్రసులో — కోటనగరున ఒక కూటము.

[ప్రవేశము:— అఖిలుఁడు, దళదమాన, కాస్యుఁడు, సేవకులు.

అఖి. తే॥ కాస్య! వేడ్కలఁ బరిమితిఁ గనుట నీతి
యఁగ చెప్పఁగి మనవిందు ముగించుటొప్పుఁ;
గోట కావలి భద్రము నేఁటిరాత్రి!

కాస్య. చెప్పితిని జేయవలసిన చొప్పయాగు
కోడ; నైనఁ బైకాపు నేఁగూడఁ జూతు.

అఖి. సరి! అయాగుఁడు మాట నిష్కర్షవాఁడె;
ఇఁకను వందనమయ్య! రేప కడఁ బెంద
లాడ నేఁగనుమా, మాటలాడవలయు.—
[దళ॥ తో॰] పోవుదము రమ్ము, వలపులపావురమ్మ!
వరము లభియించె, నిఁక ననుభవము కొఱఁత;—
వందనము, కాస్య! — రమ్ము, నా ప్రాణధనమ!

[అఖిలుఁడు, దళదమాన, సేవకులును నిష్క్రమింతురు.]

ప్రవేశము:— అయోగుఁడు.

కాస్య. స్వాగత, మయోగ! కావలి కేఁగవలయు
నీక మనము.

అయో. ఇదేల! యిప్పుడే యేటికయ్య?
పదియుఁ గొట్టలే దిప్పుడు; పడఁతిపైని
వలపుచే నాయకుఁడు వేగఁ బడక కరిగె:
అతని నిందింపరా, దింక నాపె తోడఁ
గ్రీడయే సల్పలేదు, పెండ్లాడి.—భళిర!
ఇంచువిలుకాఁడు కాంచి మోహించు రమణి!

కాస్య. ఆపెసౌందర్య మతిమనోహరమయగును.

అయో. కోటి సయ్యాటలకు బలు మేటి సుమ్ము!

కాస్య. మేలుకొన్నన, లే జవరాలు.

అయో. అయోర!
ఏమి కనులవి! మది వలపెక్కఁజేసి
కయ్యమునకు రమ్మని చీరు కరణి నొప్పు!

కాస్య. కనుల సోయగమరయ నాకర్షణమ్ము
కలదుగాని, కేవలము ముగ్ధయగు చాన.

అయో. వలపుఁబిలు పాపెపలుకులఁ బొలుపుమీఱు.

కాస్య. సుగుణఖని ఆపెయందు సొడ్డు గనరాదు.

అయో. వారి పాన్పునకు సుఖమ్ము వఱలనిమ్ము;

రమ్ము, కాస్య! తెప్పింతు మేల్ ద్రాక్షరసము;
వెలుపట సుమిత్రు లిరువురు వేచియున్న
వారు, సైప్రసుద్వీప నివాసు; లిపుడు
కూడి మనతోడ నొకగ్లాసు గ్రోలఁ గోరు
వార లథిలుని భోగ మొప్పారుపొంటె.

కాస్యు. నేఁడు కాదోయి, సఖుఁడ! యీపాడుఁ ద్రావు
డేను సైఁచగ నేర; నాకిచట [తల ముట్టుచు] మంపుఁ
గల్గఁజేయున యది యించుకయు క్షణమున;
విందులం దిది వీడి వేర్విధమునందు
సఖ్యమును జూపఁగూడిన సంతసింతు.

అయా. అట్లనకు, మా సఖులు ముఖ్యులైనవారు;
ఒక్కటే గ్లాసు — అది నేన చక్కఁజేతు,
దిగులు చెందకు!

కాస్యు. నేఁటిరాత్రి యొకగ్లాసె
యారగించితి, నదియు రహస్యముగను
అర్ధభాగము నీటితో నమరఁజేసి;
చూడు! మద్దానఁ గూడ నాచొప్పు మాఱఁ
జొచ్చె, నిఁకఁ గొంచెమేని నోర్చుకొనఁ జాల;
నా యసామర్థ్యమునకుఁ జింతఁ గనువాఁడ.

అయా. ఓయి! బ్రహ్మాండ మిం తేటికోయి? నేఁటి

శేయి పండువుగానఁ గోరిరి, మునింగి
పోవునదియేమి? యోధులు, ముఖ్యు, లిట్లు—

కాన్యు. ఏడనున్నారు వారలు ?

అయా. ఇయ్యెడనె, తూర్పు
వైపు చావడిలోన; లోపలికిఁ జీరు
మోయి! నేత్రము మెఱయఁగ నొకనిముసము—

కాన్యు. సరి, యటులెపిల్తుఁ; గాని, యసమ్మతమ్ము. [నిష్క్ర.

అయా. వీరశేఖరుఁ డీతఁ డీవేళఁ గ్రోలి
యున్న గ్లాసునకును జంట యొకటి చేరఁ
జివ్వకును ముందు దుమికి కాల్ ద్రవ్వఁగలఁడు;
మేలు! — నా రుద్రగుఁడు మోహలాలితుండు
అతివకై బుద్ధి తలక్రిందులైన వాఁడు
దశదమానఁ దలంచి సంతస మెసంగఁ
గుత్తుకండట్ట లెస్సగాఁ గ్రోలినాఁడు,
నేఁటిరాత్రి పారాలోన నిల్చువాఁడు;
బాగు! — సైప్రసుదీవి నివాసులైన
గరువపున్మైనకాంగ్ర్డ ముష్వురు తవరలఁ
దొట్టినం గొట్టు పొగరుఁబోతుల నిచటికిఁ
బిలిచికొనివచ్చి పెల్లు మత్తిలఁగ మధువు
నానఁ జేసితి; వారుఁ బారాను నిల్వ

ననుమతించిరి; కాస్యుఁ డుక్కణము తిరుగు—
మజ్జ! యీ త్రాగుఁబోతులమధ్య నతని
కెట్టులే నాగ్రహము కొల్పి రట్టు సల్పి
పట్టనమునఁ గల్లోలము పుట్టునట్టు
చేయఁ గల్గిన, నటుపైనఁ జెప్ప నేల?——
వారుగో వచ్చుచున్నారు! — పన్ను గడకు
సూటిగా నేఁటి కర్జ మచ్చుపడె నేని,
నడచు నిఁక నిరాటంకమై నాదు నావ
గాలిసాయమ్ము నీటివేగమ్మెసంగ!

ప్రవేశము:— కాస్యుఁడు, మంతనుఁడు, మిత్రులు; మధుపాత్రములతో సేవకులు. అందఱును గూర్చుండి త్రాగ నారంభింతురు. అయాగుఁడు త్రాగునట్లు నటించునే కాని త్రాగఁడు.

కాస్య. స్వామిసాక్షి! అచ్చటనే యొసంగిరయ్య
పెద్ద గ్లాసెడు; నాకింక వద్దు, వద్దు.
మంత. కొంచియమ యిది; నాతోడు! క్రోలుమన్న;
యోధులకు నేస్త మిప్పట్ల నొప్పవలయు.
అయా. తెండి హా! మఱికొంచెము తియ్యరసము.

---

[గ్లాసుమీఁదఁ గొట్టుచుఁ బాడును. పంతువరాళి - రూపకతాళము.]

పల్లవి॥—గామ, రిస, సీస, రిగ - గామాపా । గామరి ।
గామ, రిస, సీస, రిగ - గామాపా॥
అనుప॥—సీస, రిసని, దాప, దాసి -
దాని, దపమ, దామ, గమపమ ॥ గామ ॥

ప॥ మంచి యోధుఁడైనఁగాని - మర్త్యుఁడే। యో।
జించి చూడ నాయు వొక్క - జిల్లెడే ॥
అను॥ కించ విడిచి మద్య మార -
గించి సుఖముఁ గాంచుఁ డెంతటి ॥ మంచి ॥

---

తే॥ మఱియుఁ గొంచెము కొని తెండు మధురసమ్ము.
కాస్యు. హాయిరే! మేలు రంజనమైన పాట!
అయా. దీని నేర్చితి నాంగ్లేయదేశమందు;
అచటివారలు మధుపానమందు ఘనులు;
జర్మని, హాలండు, డెన్మార్కు జానపదులు
వారిమ్రోల గవ్వకుఁ గొఱగా — రోహోహోరె!
మధువుకొనిరండు, తోడెను మధువు! మధువు!
కాస్యు. ఆంగిలేయుఁడు పానమం దంత దిట్టొ?
అయా. మేటిప్రోడఁడ. డేనుఁడు స్మృతిఁదొలంగు,
జెర్మనీయతఁ డొడలెల్లఁ జెమటఁ గాంచు,
అల హాలండునకును వాంతియబ్బుఁగాని,
మేరఁగనఁ డాంగిలేయుఁడు — మేర లేని
యల సురారాశి నేగ్రోల వలఁతి యతఁడు!

[అందఱుఁ ద్రాగ నారంభింతురు.]

కాస్యు. అఖిలనాయకు నారోగ్య మడరుఁగాత!
మంత. నా యభీష్టము నదె, యువనాయక! వరి

పూర్ణమై నాదు పాత్ర మెప్పు నిదె కనుము!
అఖిలునకు భోగసంపద యమరుఁగాత!

[మధుపానము చేయుదురు.]

అయా. చాఁగురే! నిండు పండువు సాగె మనకు!

---

పాట. [పూర్వకల్యాణి. రూపకతాళము.]

ముఱియరాదురా – సిరి – స్థిరము కాదురా।
తిరిగి పెగాఁడు – ధరణిపుఁ డని।
మరణపుఁద్రాసున – మన్నన లేదుర॥ ముఱియ॥
చిందు లేలరా – తల – క్రిందు మేలరా!
అంధకార – మందణఁగక।
ముందటి చందము–నుందలపోయుర॥ ముఱియ॥
ఇంతియధరము – అది – యెంతమధురము।
సుంత చొక్కుఁ – జుక్క – నంట
వింతగ నాత్మ – చింతన చేకుఱు॥ ముఱియ॥

కాస్యు. బలే సెబాస్! బలే తమాస్! బలే బలే మజ్జా!
హా – హా – హా – హా......

అయా. మరలఁ బాడుదునా?

కాస్యు. వద్దు, వద్దు! ఆపనులు చేయువాఁడు తనపనికి త
గఁడు. ఊఁ! — పై యీశ్వరుఁ డెఱుఁగును — ర
క్షింపఁ దగినవారున్నారు — తగని వారున్నారు!

అయ్యా. నిజము — యువనాయకా! నిజము, నిజము!

కాస్యు. నామట్టు — మన నాయకుని — ఎవరిని — నిందించుట కాదు — నామట్టు — నామట్టు — నాకు — రక్షణ — నాకోరిక.

అయ్యా. నాకు నదే కోరిక.

కాస్యు. [త్రాగుడు మత్తు స్వరములతో] — ఒ- హో! — నాకంటె ముందు కాదు! — యుఁవనా — ముందా — అనుచరుఁడు? — కాదు — కాదు! — [కొంత తెలివి తెచ్చుకొని] చాలు! — ఇంత చాలు! — ఇంక మన పనులకు — [నడచిపోఁబోయి తూలును. కన్నులు మూతవడిఁ కుర్చీపట్టుకొని నిలుచును.] మా పాపములు మన్నించు! — [కష్టముతోఁ గన్నులు తెఱచి] — అయలారా! మన పనులకు — రండి! రండి! — [అని రెండడుగులు సాగి క్రిందఁ బడుచుండఁ దక్కినవారు పట్టుకొనఁబోవుదురు. అప్పుడు తెలివితెచ్చుకొని నిలిచి, తూలుచు] — అ- అయలారా! — నాకు తెలివి త-త-త-త-ప్పలేదు. ఇతఁ డనుచరుఁడు — [మంతనునిఁ జూపును] — ఇది నా కుడిచేయి, యిది యెడమ — [తప్పుగాఁ జూపును] — నాకు ఒళ్లు తె- తె- తెలిసేయున్నది. చూడు — తి-తిన్నగా నిలువఁగలను — [తూలుచుండును] — చ-చ-చక్కగా మాటాడఁగలను.

అందఱు — బలే ! ప్రశస్తముగా !

కాస్యు. అయిన సరే. త - త - తప్పుత్రాగితినని — త -

త - త — [కష్టముతోఁ గన్నులు తెఱచి చదువును.]

మంత. అయ్యలారా ! ఘాటునకుఁ బోగు పారా ఫర్మా

యింతము రండు.

అయా. తే॥ చూడు, మీకాస్యుఁ డరిలోఁ జొక్కినాఁడో!

అల్ల సీజర్మహావీరు నండ నుండి

సేనలం బన్నుఁగల యోధశేఖరుండు ;

ఇతని సామర్థ్య మీలోప మెన్ని చూడ

సమములైన యహార్నిశలమొగిఁ దనరు ;

ఇతనియం దథిలుఁడసు నిల్పు హెచ్చునచ్చి

కెప్పుడో కానికాలము చొప్పడి నితఁ

డీ పగిదిఁ జొక్కియుండ నీ ద్వీపమందు

ముప్పు గలిగించునని భయముఁ గనుచుందు.

మంత. ఎప్పుడును జొక్కు గల్గునే యితనికిట్లు ?

అయా. కల్గి యటుపైన నొడలెఱుంగక నిదురను

బడి పొరలుచుండు. ఇతని కీ పాడులోప

మొకటి లేకున్నఁ గన్ను మూయకయె కావు

నిల్వఁగలవాఁడు రేయి రెండింతలైన.

మంత. నాయకున కిది జ్ఞప్తినుంట యుచితమ్ము —

ఎఱుగునో యెఱుఁగఁడో, లేక, యెఱిఁగియుండి
యితని సద్గుణగణమునే యెన్ని, యిట్టి
లోపమును బరిగణనమ్ములో నిడండొ ?

ప్రవేశము:— రుద్రగుఁడు.

అయా. [అతనితో రహస్యముగా] —
ఓయి ! యిట కేల వచ్చితివోయి ? కాస్యు
వెంటఁ జని నాపనుపు నెఱవేర్పఁ జూడు !

[రుద్రగుఁడు నిష్క్రమించును.

మంత. ఇట్టి సహజలోపము గల యట్టివాని
నకట ! యువనాయకస్థానమందు నిల్పి
ఆపదను గొంట శోచనీయమ్ము గాదె ?
తెల్లముగ మూరునకు నిట్లు తెల్పరాదె ?

అయా. అమ్మ నేఁజెల్ల ! వెనిసురాజ్యమ్ము నాకుఁ
గట్టిపెట్టిన నావల్లఁ గాదు సుమ్ము ;
కాస్యునెడ మిత్రభావ మగ్గలము నాకు ;
అతనికీలోపమును దీర్చు జతనమందె
యెపుడు మెలఁగుదు. హా! అది యేమియార్పు?

[తెరలో — 'అయ్యయో ! రక్షింపుఁడు ! రక్షింపుఁడు ! — అని యార్పు.]

---

ప్రవేశము:— రుద్రగుఁడు, అతనివెంటఁ దఱుముచుఁ గాస్యుఁడు.

---

కాస్యు. మాల తుంటరిగాడిదె ! రాలు గాయ !

మంత. ఏమిచేడిది మూాఁడె? అదేమి, కాస్య?

కాస్యు. అఱవకుంక వీఁడా బుద్ధిఁ గఱపువాఁడు?
త్రాగుఁబోత! నీతావున కేఁగు మనియె —
ఔర! నిర్భయముగ నన్ను దూఱె! — వీనిఁ
దొక్కుతొక్కుగ నలియంగఁ ద్రొక్కిచీల్తు.

రుద్ర. చీలుతువె, సరి!

కాస్యు. ఇంకను ద్రేలెదొక్కొ? [కొట్టును.

మంత. నిలునిలుము, యువనాయక! నీదుపున్నె
మయ్య! యించుక శాంతించుమయ్య! నిలుము!
[పట్టుకొని యాపుచున్నాఁడు.

కాస్యు. విడువిడుము నన్ను, విడవేని వ్రేటుఁగొనుము!
పుచ్చెయిప్పుడ రెండుగ విచ్చుఁ, గనుము!

మంత. త్రాగి తూలుచు నివ్వగ వాఁగె దీవు;
చాలు, శాంతించుమా!

కాస్యు. త్రాగి తూలుటేడ?

[ఇద్దఱును బోరాడుదురు.]

అయా. [రుద్రగునితో రహస్యముగా] —
ఓడు! దండునఁ గలహ మోహో! యటంచుఁ
గూయు, ముఱుకుము! కొట్టుము కోటగంట!
[రుద్రగుఁడు నిష్క్రమించును.

వలదువలదన్న, కాస్య ! నాపల్కు వినుము!—
వలదు, మంతన ! తగునె యిప్పుడిగి పోరు ?—
రండహో ! జగడము మాన్పరండు ! రండు ! —
ఊపుగుఁడయలార ! ఆగుఁడయ్యో యుపుగుడు!
ఓహోరే ! మంచికావలి యొప్పెనిపుడు !

[గంట మ్రోఁగును.]

అయ్యో ! ఆగంట మ్రోయించు దయ్యమెవరు ?
పట్టనమ్ము కల్లోలమై పరఁగు నింక ! —
ఛీ, యిసీ, కాస్య ! సిగ్గుఁ దెచ్చుకొనవయ్య !
ఈ ప్రవర్తన సేనాని కెఱుకపడిన
నీకు నవమానము ఘటిల్లు, నిక్కమయ్య !

ప్రవేశము:— అధిపుఁడు, సేవకులు.

కాస్యుఁడును మంతనుఁడును బోరాడుచునే యుందురు.

అధి. ఏమి గలిబిలి యిది ? కయ్యమేటి కిట్లు ?
మంత. నెత్తురువరద, లయో ! యిఁక నేను బ్రదుక !
చెడ్డ గాయము ! — ఇదిగోఁ జచ్చితివి, చూడు !

[కాస్యునిపై ఉఱుకును.

అధి. ఆగుఁ డింతటఁ, బ్రాణముం దాసయున్న !
అయా. ఆగుమా, కాస్య ! — మంతనా ! ఆగుమయ్య !
ఆగుఁ, డయలార ! నయవినయమ్ము లెల్లఁ
బారఁద్రోలి యీతీరునఁ బోరఁ దగునె ?

నాయకుని యాజ్ఞయయ్యె, నింతట నిలుండు!
లజ్జగొనుచు నాతని పల్కులను వినుండు!

అఖి. ఉ॥ ఏమిటి కయ్యలార! యిటులేల? తురుష్కుల
యాఁచు మీరు మీ * మ్మే ముగియించుకొందు
రొకో! మేలొకో దైవకృపం దొలఁగు కీ * డే
మఱిఁ దెచ్చికొంటయు? ఇసీ! యిఁక లజ్జ గొ
నుండు! లేనిపో * రాములు గాంతురా! తలఁ
పరా మది నిందునఁ గల్గుచేటులన్?

కం॥ ఉడుగుఁడు మీకయ్య; మ్మిఁక
నడుగిడువాఁడ యపరాధి, యాతఁడె మే యు
క్కడఁగుట నిక్కము; — పురమునఁ [సేవకులతో]
గడు భయ మొదవించు నల్లగంట నిలువుఁడీ!

తే॥ ఏమిటయ్యలార! యీకయ్య మెట్లుగల్గె? —
పల్కుమీ, అయాగ! చింతావివర్ణుఁడైతి!
ఎవ్వరిది త్రోడఁగిరి, యట నెట్లు పెఱిగె,
సిపెరిమ త్రోడు! — భయమేది నిజము తెల్పు.

అయా. ఉ॥ ఏమని పల్కువాఁడ? ఇపుడే పడకింటి సతీ
పతుల్ బలెన్ * ప్రేమల మీఱుచుండి, కడువిం
తగ నెట్టులో — యే గ్రహమ్ము పా * టో — మరి
యాదఁదప్పి యిటు లొప్పిరి కయ్యమునందు వై

రుల * ళ్లే; మది నెన్నఁజాల మొదలియ్యది దీని
కటంచు నాయకా!

తే॥ ఈ గొడవఁ గన్నులారఁ గొంతేనిఁ జూడ
నన్నిటకుఁ గొని తెచ్చిన నాపదములు
పగతుర శిరమ్ములను ద్రుంచు పనినిఁ దవిలి
రణమునం దెగియుండ లేదని వగచెద.

అభి. మైమఱచి యొప్పితివి, కత మేమి, కాస్య!

కాస్యు. కరుణ క్షమియింపుఁ డేమి పల్కంగ నేర.

అభి. ఉ॥ మంతన! కాంచినాఁడవు సమంచితకీర్తి, బుధాళి
మెచ్చఁగా * శాంత గభీరభావ విలసన్మృదువ
ర్తన మొప్పఁ జేయుచుణ్;* వింత యిదేమి నీయ
శము వీడి నశింపఁగ నేఁటిరాత్రి యీ * అంతు
నఁ జేరినాఁడవు, గరాసనిపేరు గడింప నిష్టమే?

మంత. తే॥ అభిల! మహనీయ! యీ యపాయకరమైన
గాయమునఁ జేసి యిపుడు పల్కంగ శక్తి
లేనివాఁడ; సహింపఁగ రాని నొగులు
ప్రాణమును బీల్చుచున్నది. వార్తయెల్ల
మీయనుచరుం డయాగుఁడే మీకుఁ దెల్పఁ
గలఁడు; వేఱుగ నేఁ జెప్పఁగలది లేదు;
వనా నుడివిన తప్పఁ బల్కమి మెఱుఁగ;

నావలని తప్పించనియు నెన్నంగఁ జాల;
కారణము లేక తనమీఁదఁ గయ్యమునకు
దుముకువాని నెదిర్చి భద్రమును గోరి
ఆత్మరక్షణమందె యొప్పారుటయును
దప్పయేని నాదైనపని చెప్పఁదగును.

అఖి. చం॥ రవులఁదొడంగెఁ గిస్క; రుధిరంబు నడిం బరుసత్తి సాగి బు * ద్ధివశము తప్పుచున్న యది;
తీవ్రతఁ బూనిలిసేని నాదు శి * క్షువలన నెట్టేడుం
జెడి విషాదమునంబడుఁ; బల్కుఁ డిందుఁ ద *
ప్పెవని, దతండు సోదరుఁడ యేఁ గనపుట్టిన యేని
పీనుదుక్.

తే॥ ఔర! యుద్ధ భయమ్మున నడలుచుండి
యిపుడిపుడ శాంతిఁ గాంచెడు నిష్ఠురమున,
అర్ధరాత్రి సమయమున, నదియుఁ గోట
కావలి ప్రదేశమునందె, యిక్కరణిఁ గలహ
మొప్పఁజేసి యెదుర్కొని యొండొరులను
ద్రుంచుకొనఁజూచు నంతటి దుండగమ్ము! —
ఎవ్వరు తొడంగి రిది, పల్కుమీ, అయాగ!

మంత. చెలిమి కతమున నేఁ దోడికొలువు కతన
నేనిఁ గల తెఱఁ గెఱిఁగింప నిచ్చుతగ్గు

గా వచించిన, జోదువు కావునున్ను !

అయా. ఉ॥ ఆనవచింపకయ్యా ! కలదా ప్రియమిత్రునకెం
దునేనియుఁ * హాని పొసంగఁజేయుట ? మన
మ్మునఁ గుందక జిహ్వ వీడుదుం * గాని పొనర్పఁ
గాన్యునకుఁ గష్టము నానుడి; నైన, నియ్యెడఁ *
గానదు నేర మాతనిది, కల్గినదెల్ల నిజమ్ము వల్కె-
నఁ.

తే॥ నాయకా ! యిటులయ్యా — మంతనుఁడు నేను
మాటలాడుచుండఁగ నొక మత్తుఁడెవఁడో,
అయ్యో ! చచ్చితి ! రక్షింపుఁ డని యఱచుచుఁ
బాఱుతెంచెను. కాన్యుఁడు వాని వెంటఁ
దఱిమికొనివచ్చె వాలు చేతను ధరించి,
వానిఁ ద్రుంచునయట్లు; లద్దానిఁ గాంచి,
ఆగు మాగుము ! శాంతించు మనుచు నితఁడు
కాన్యునకు నడ్డునిల్చె; ఆ గలబలోన
అఱచినాతఁడు తుఱ్ఱునఁ బఱచె; నేను
నతని వెనువెంట నంటితినయ్యా, పురము
నందు గల్లంతు పొసఁగునో యనుచు వెఱచి;
కాని, యవ్వాఁడు వాయువేగమునఁ బాఱి
నన్ను మీఱంగ మరలితి; అన్నిముసమె

ఖడ్గములచప్పు డిచ్చట ఖంగుమనుచు
వినఁబడియె. కాస్యుఁడును నోరువిచ్చి పెంచ్చు
బొంచ్చుఁబల్కులు శపథముల్ బువ్వసాగె —
నేఁడకాని యెన్నఁడు నిట్టి జాడ లేదు;
నే నిటకుఁ జేరుసరికిఁ గయ్యాన నిలిచి
యొండొరులఁ జెండికొను రీతి నుండిరయ్య,
మీరు గనినట్లె; యింక నేమియు నెఱుంగ;
నాథ! యెంతటి వారయ్య నరులనంగ?
ఒక్కొకపు డెట్టి పెద్దలు నొడలు మఱచి
మెలఁగుదురు, వారి మన్నింప వలయుఁగాదె?
మంతనున కిట దొరసె నొక్కింత దోసఁగు —
కోపమున మిత్రులనుగూడఁ గొట్టుటరుదె? —
కాని, యీ పాఱిపోయినవాని వలన
ఎయ్యదియొ కాస్యునకు దొడ్డ యెక్కసెకెము
సైంచఁగారాని దత్తె, నిశ్చయము యగును.

అథి. తెలిసె, ననుచర! నీచెల్మి తేల్చెపల్కెఁ
గాస్యు తప్పిదమును. — ప్రేమఁ గందుఁగాని,
కాస్య! నిన్నిట దండింపఁగా వలసెడి;
నీవలనఁ బెఱలకు బుద్ధి నెగడవలయుఁ
గాన, నాయండ నుద్యోగివై నిలువకు. —

ప్రవేశము:— దళదమాన, సేవకులు.

అదిగో! ప్రేయసియును లేచి యరుగుదెంచె.

దళ. ఏమి మూఁడెఁ, బ్రాణప్రియా!

అక్షి. ఏమి లేదు;

శర్కరారాశి! అంతయుఁ జక్కఁబడియె;
రమ్ము శయ్యకు! — ఇతని గాయమ్ములకుఁ జి
కిత్స యేన యొనర్తుఁ, బైకిఁ గొనిరండు.—

[మంత్రనునిఁ దోడ్కొని పోవుదురు

భద్రముసుమా, అయాగ! కావలి గణించి
పురమునందు సందడి యడంపుము బిరాన.—
రమ్ము, ప్రియ! యోధ సౌఖ్యవిధమ్ము సుమ్ము
శయ్యములను నిద్రాభంగ మియ్యకొంట.

[అయాగుఁడును కాస్యుఁడును తక్క అందఱు నిష్క్రమింతురు.]

---

అయా. గాయమా, కాస్య!

కాస్యు. ఔ, నే యుపాయముననుు
జక్కఁ బడరాని గాయము!

అయా. స్వామి కరుణ
నటులఁ గాకుండ వలయు.

కాస్యు. అయాగ! యశము!
యశము, యశము, నా యశమహో! హానిచెందె;

నాశమయ్యెను సతమైన నాయశమ్ము,
నిలిచినది యెల్ల హేయమ్ము నిష్ఫలమ్ము;
నాదుయశ,మయ్యయో! అయాఁగ, నాయశమ్ము!
అయా. మమ్మ రే! నాదు సత్యవాక్యమ్ము తోడు!
కాయమున గాయమని యూహఁగాంచి భయము
చెంద నుంటి, దాన నెకింత చింత కలదు.
యశము యశమన నేమయ్య? వ్యర్థమైన
పై తొడుగు వేస; మయ్యది పల్మ రెట్టి
సుగుణమును లేక లభియించి సొబగు మీఱు,
దోసమే లేక పల్మఱు తొలఁగి సనును;
ఇత్తఱిని నీ యశమ్మున కించు కేని
భంగ మొదవంగ లే; దొకభంగి నొదవె
నేయని తలంతు వే సరిచేయు టెంత?
నాయకు వశమ్ము చేసికొనంగ నెన్ని
మార్గములు లేవొకో, చింత మానవోయి;
అతఁ డిపుడు నిన్నుఁద్రోయుట యరసి చూడ,
నీపయినిఁ గోపమునఁ గాదు, నిశ్చయమ్ము,
యితరులకు భయమొదవింప నెంచి సుమ్ము;
సింగమును దిగులొందింపఁ జిట్టి కుక్కఁ
గొట్టు చందమ్ము; సమయమ్ము గుఱ్తెఱింగి

వేఁడికొన్న, నాయకుఁడు నీవాఁడ నమ్ము.

కాన్స్యు. నాయకాగ్రేసరుఁ డఖిల నాయకుండు;
అట్టి మహనీయునండ నాయట్టి త్రాగుఁ
బోతుకంత యుద్యోగిమై ముప్పుఁదెచ్చుఁ
గాన, నాకొల్వు మఱి వేఁడఁగలనె ? నన్ను
ద్వేషమునఁ గనుఁడనియె ప్రార్థింపఁ గలను.
త్రాగి నోటవచ్చినదెల్ల వాఁగు, టొడలు
తెలియ కిటునటుఁ దూలుట, తిట్లునోట్లు
మిగులనాడుట, శపథముల్ మీఱుట, తన
నీడతోడనె భాషించి వేడుకఁగని
పొంగిపోవుట !—త్రాగుడు బూతము ! నిను
దయ్యమనుపేరఁ బిల్వఁగాఁ దగునుగాదె ?

అయా. అన్న ! నీత ర్కికొనివచ్చి నతఁడెవండు ?
ఏమి కీడొనరించె ?

కాన్స్యు. ఏ నే మెఱుంగ.

అయా. ఏటి వింత !

కాన్స్యు. నా జ్ఞప్తి నేమేమొ కలదు;
కాని, తేటగఁ దెలియ దొక్కటియుఁగూడ;
గొప్ప కలహ, మ దేటికో గుఱుతు లేదు;—
అయ్యయో ! శత్రువును గొంతునందుఁ జేర్చి

బుద్ధిఁ గోల్పోవు టెంతటి పెద్ద తెలివి!
సంతసము, సంబరముఁ దాల్చి సరదతోడ
మృగములుగ మాఱుటది యేటి మేటి పదవి!

అయా. ఇపుడు మైకము కాన, దదెట్లు విడిచె?

కాన్స్య. కైపుదయ్యము పఱచె నాగ్రహపిశాచ
మత్తి;— ఒకలోపమున బయలయ్యె నొకటి,
నాపయిని నాకె ద్వేషమ్ము నాటికొనఁగ.

అయా. షొమ్ము! నీ నీతు లతికఠినమ్ము, లన్న!
ప్రస్తుత స్థితిగతులను బట్టి నేఁటి
గలబ లేకుండినన్ మేలుగాఁ దలంతుఁ
గాని, వగవంగ ఫలమేమి కడచినట్టి
దాని? కది చక్కఁజేయు యత్నమె హితమ్ము.

కాన్స్య. నను మరలఁ గొల్వొనం గోనుఁ డనుచు వేఁడ,
ద్రాగుఁబోతువటంచు నాతండు వల్కు—;
ఆ నుడి వినంగ నాకు నీరేను నూర్ల
నోళు లుండిన నొక్కటఁ న్మూతపడును.
ఈ నిముసమందుఁ దెల్వి, యాపైన మంపు,
అంతఁ గొంతవడికి మృగమట్లు యగుట! —
ఎంత వింతిది, అయ్యయో! సుంత యేని
హెచ్చుగా నారగింప న వేమిపాట్లు! —

అది మధువుకాదు మత్తుదయ్యమ్మ యౌను.

అయ్యా. మంచిదయ్యమ్మ యౌనయ్య మధువు, మనము
మేర మీఱనిచో; దాని దూఱనేల?
అన్న! యువనాయకా! అనయమ్ము నాకు
నీయెడలఁ బ్రేమ కలదని నిశ్చయముగ
నమ్మువాఁడవ యనుచు నే నమ్మువాఁడ.

కాన్స్య. సంశయము లేదు, నే నది చక్కఁగంటి;
అయ్యయో! త్రాగుఁబోతున నైతిఁగాదె!

అయ్యా. ఓయి! నీకే మఱేనికే నొక్కొకపుడు
త్రాగి స్మృతి తప్పటోలయు; నద్దానిఁ బెద్ద
తప్పుగా మదినెన్ని చింతఁ గనరాదు.
నీవిపుడు త్రొక్కవలసిన త్రోవఁ గనుము;
ఓయి! మన నాయకునకుఁ బై నాయకుండు
ఏర్పడియె నోయి! ఎవరో యూహింపఁగలవె?
అతని ముద్దుల పెండ్లము — అల్లదశద
మోన; యచ్చాన సుగుణసంపదను సతత
మాతఁ డెన్ని మురియుచుండు; నా పెమాట
కడుగు దాటఁడ; యింతట నాపెను గని
కల తెఱంగెల్లఁ దెల్పి నీకొలువు వేఁడు
మోయి; ఆయమ నిష్కలుషోత్తమగుణ

శాలి, యాశ్రితకల్పవృక్షమ్ము, సదయ
హృదయ ; వరియించు మేరకు నెచ్చోసంగ
కున్కి లోపమ్ముగా నెంచునోయి ; యాపె
తలఁచెనేని నాథునితోడఁ దగినరీతిఁ
బల్కి, నీపైన నతని కోపమ్ము మాన్పి,
మీ ప్రియమ్ము మునుదటికన్న మిక్కిలియయి
యొప్పఁగాఁ జేయు.

కాస్య. మేలైన యోజనయిది.

అయా. నా ప్రియముతోడు! నీపైన నామనమున
జాలి గల్గంగ నల్లయోజనయుఁ గల్గె.

కాస్య. సందియమ్ము లే ; దుదయమ్ము పెందలకడ
దశదమానను గాంచి నాతప్పుఁ దెల్పి,
నాయకునితోడ నెట్లేని నన్నుఁ గూర్చ
కరుణ గలుగంగఁ బల్కి నన్గావుమంచు
ప్రార్థనము సేతు ; ఇయ్యది వ్యర్థమైన
ముందు మార్గ మయోమయమ్ముగను దనరు.

అయా. భయపడకు, మటు సేయుము, జయము కల్గు;
పొమ్ము, కావలి కింకనేఁ బోవలయును ;
వందనమ్ము, యువనాయక !

కాస్య. ప్రాణమిత్ర !

వందనమ్ము! అయాగ! విశ్వాసపాత్ర! [నిష్క్ర-

అయా. మ॥ నను దుర్మార్గుఁ డనం గలాఁడెవఁడు? సంతా
పమ్మునంబొక్కు మి * త్రునిపైఁ బ్రేమతలిర్ప ని
ప్పగిది సంతోషమ్ము చేకూర్చు త్రో * వను బో
ధించితి; మూరు నాగ్రహము బాపంగా నుపా
య మ్మిదే * యని పల్కుచుందగ దే? సతీమణి సహా
యం బబ్బ దే వేఁడినన్?

క॥ ఔదార్యమునం దాయమ
భూదేవియ; ఆపె మొదల మూరుఁడు సేయుం
గాదె తలతోఁడ? తనమత
మేదగ వలసినను సంశయింపఁడు గాదే?

చ॥ అలసతి ప్రేమ సంకిళుల నాతనియాత్మ తగుల్కొ
నెన్; విడం * గల వెరవేది? కీలు బొమ్మకై వడి
నామెగఁ డిట్టులట్టు లె * ట్టులతివ త్రిప్ప నాగతిఁ
గదున్ సులభమ్ముగఁ దిర్గుచుండఁడే? * తలఁపఁగ
నెంత, కాస్యుని వెతారము మాన్పుట యన్న నా
పెకున్?

తే॥ ఇత్తెఱినిఁ గాస్యునకు లాభ మత్తఁ జేయు
వెరవు వేఱొండు లే; దిట్టి వితము తెల్పు
నీ యయాగుఁడు దుర్మార్గుఁ డెట్టులౌను?

భళిర ! దయ్యమ్ము తాల్చు దైవస్వరూప !
మొదను బల్ పాపకార్యమ్ములే గణించి
పెనుఁబిసానులు తమ పయి వేసములను
బుణ్యశీలముఁ దాల్చి కోపుఁగని యాస
పుట్టఁజేసి రగుల్చుట యిట్టకాదె ?

మత్త-కో॥-ఈయమాయకుఁ డింక మూరున కెట్టులేని సి
పారసుం * జేయుమా ననుఁగాఁవుమా యనిచింత
తోఁ దనువేఁడఁగా*ఆయమాయకురాలు నైజ
దయారసమ్మున భర్తతోఁ * దీయమాటలఁ గా
న్యుసేరముఁ దేల్చిపల్కి క్షమాపణల్ * సేయఁ
గా బతిమాలు ; అంత, బలే! ప్రయోగము సేయు
దుణ్ * నా యుపాయము ; మూరుకర్ణమునణ్
విషమ్మును జల్లగాఁ*బోయెదుణ్, సతి వేఁడికోల్
తన మోహమ్ముం దనియింపఁగా * నేయటం ;—
చట వేఁడుమేరనె హెచ్చుదే యనుమానముణ్?

కం॥ ఇప్పగిదిణ్ మసిబుగ్గిగ
నొప్పించనె యాపె సదమలోజ్జ్వల గుణముణ్?
జొప్పఁ గనలేనె యిందే
గొప్పవలంబన్ని వారిగుమిఁ గూల్పంగణ్ ?

[నిష్క్రమించును.]

రంగము ౮.

సైప్రసుకోట, పారా ఘాటు.

ప్రవేశము:—అయాగుఁడు, రుద్రగుఁడు.

——: o :——

అయా. తే॥ ఏమి, రుద్రగ!

రుద్ర. ఏమున్న, దిచట నేను

వేఁటలోఁ జేరి పరువిడి వేసటఁ గను

కుక్కనైతిఁ జుమీ, వేఁట కుక్కనెట్లు?

ద్రవ్య మడుగంటె; నీరాత్రిఁ దన్నులబ్బెఁ,

దృప్తిఁగని మేలుకాంచి బుద్ధిగొను నట్లు!

నాపడిన కష్టమునకు జ్ఞానమె ఫలమ్ము

గా నగుట రూఢి పర్యవసానమందు;

ధన విహీనుఁడనై జ్ఞానధన మొకింత

చేకుఱిన యందులకు సంతసిల్లి వెనిసు

పురి కరుగువాఁడనని నిక్కముగఁ దలంతు.

అయా.— [మధురగతి రగడ] – మోహన రాగము.

సహనము, తమ్ముడ! సహనముఁ గనుమీ,

సహనముఁ దాల్చిన జయమగును జుమీ!

ఆత్తరమునఁ జెడునప్పా కార్యము,

చిత్తమునఁ విడఁజెల్లదు ధైర్యము;

మంత్రము రాల్పదు మామిడి పండ్లను,
తంత్ర మమర్పం దగు వడగండ్లను;
నిల్కడ యొప్పక నెగ్గ దుపాయము,
చుల్కఁగ మానుట చూతువె గాయము?
పూచినదినమే పుట్టునె ఫలమును?
నీ చెయ్దమున గణించు ఫలితమును;
తింటివి కాస్యుని దెబ్బలు స్వల్పము,
కంటి వతనికిం గ స్తి యనల్పము;
వేడి వెలుఁగు కృప వెలసెడి వృక్షము,
నీడనుబడు గ్గె నిలిచెడి వృక్షము —
హెచ్చుగ నున్నది యెడ్డమిఁ గాంచెను,
పొచ్చెముఁ గన్నది మును పుష్పించెను;
ఫలము కలుగు, నిఁక భయపడ కోయీ;
తెల తెలవారె, నదే! కనవో? యీ
కడ నిలఁబడకు, తికాణకుఁ బొమ్మా;
కడువడి నంతయుఁ గందువు లెమ్మా!
పద నొప్పు, దిపుడు వల దీముచ్చట;
ఉదయ, మయా రే! యుండకుమిచ్చట. [రుద్ర. నిష్క.
పని తవిలిన సంబరమంటిన తఱి
మనమునఁ గాలగమన మొప్పద సరి! —

ఇరు కర్జమ్ముల నిపుడు నడపవలె—
ఉఱవారసి కాన్స్యునకుఁ యామిలె
సరగున అమదర్శన మొనగూర్చుట ;
సరి! అట మూఁడు నచటికిం జేర్చుట ;
అది యే వితమున? అంతకు ముందే
ఎదియో కతమున నించుక యెందే
నాతనిఁ గొనిసని యటకు హఠాత్తుగ
నాతఱి వచ్చుట — హా! యిది యత్తుఁగ
దా! వహ్వారె! వహ్వారె! విజయముగుఁ
గావుత! మిది తిన్నఁగఁ బన్నఁదగుఁ.

[నిష్క్రమించును.]

---

ద్వితీయాంకము సంపూర్ణము.

---



# తృతీయాంకము.

—౦:౦:౦—

## రంగము ౧. — సైప్రసు, కోటనగరు ఎదుట.

ప్రవేశము:— కాస్స్యుఁడు, పాటకులు.

---

కాస్స్యు. తే॥ ఇచట నిలుఁ, డయ్యలార! యేదేనిఁ జిన్న
మేలుకొలుపును బాడి నా మెచ్చుఁగొనుఁడు.

పాటకులు.— బౌళి — త్రిపుటలఘువు

పల్లవి॥ — మేలుకో దయానిదీ - మేలుకో కృపానిధీ!

అనుప॥ — మేలుకో దయానిధీ -
మిత్రోదయ మా వేళ ॥ మేలుకో ॥

చరణ॥ — వీరలెల్ల నిన్నుఁ జూడఁ —
గోరివచ్చియున్నవారు ।
వారివందనములు గొనుము-
వనిత దశదమాన మెచ్చ॥ మేలుకో ॥

---

ప్రవేశము :— సేవకుఁడు.

సేవ. అయ్యలారా! మీ వాద్యములు నేపిల్స పురికిఁ
బోయి వచ్చెనా యేమి, ఆలాగు ముక్కుతోఁ
బాడుచున్నవి ?

౧ పాట. అట్లుంటె, రదియేమి ?

సేవ. ఓహో! మీవాద్యములు వాయుప్రాణులు గాం
బోలును.

౧ పాట. అవునండి, వాయుప్రాణులే.

సేవ. అందుననే మూలుగు.

౧ పాట. ఎందుననండి మూలుగు ?

సేవ. స్వామితోడు! వాయుప్రాణులకుం బెక్కుటికి ము
క్కుతోటి మూలుగు నే నెఱుంగుదును. సరే
కాని, యిదిగో మీకు బహుమానము! నాయ
కుండు జాబులు వ్రాసికొనుచు మీగానామృతము
సంతృప్తిగం గ్రోలి, యింక నీ ధ్వనిచాలింపు బతి
మాలుకొనుచున్నాండు. ఇంతట నిలుపుండు.

౧ పాట. చిత్తము! నిలిపితిమి.

సేవ. ఏదేని వినంబడని గానమున్నం గొంచెము కానిండు!
—నాయకునకు గానమునం దభిరుచి హెచ్చుకా

౧ పాట. అట్టిది మాయొద్ద లేదండి. [నదు.

సేవ. అట్లయిన, మీ గొట్టములుం దిత్తులును మీ సం
చులలో వేసికొని వెడలిపొండి!—నాకుం బని
యున్నది.—పొండి! గాలిలోం గలిసి మాయము
కండి! [పాటకులు నిష్క్రమింతురు.

కాన్స్య. ఓయి! యిదిగోనోయి!

సేవ. ఇది గోనె కాదండి.

కాన్స్య. నీ హాస్యములు కట్టిపెట్టి — యిదిగో ఈకాసు జేబులో వేసికో! — అమ్మగారి వెంటవచ్చిన ఆఁడుదోడు లేచితిరుగుచుఁ గనఁబడెనేని, నీఁవోడఁగాంచెము మాటాడఁగోరి, యెవరో కాన్స్యుఁడఁట వచ్చి యున్నాఁడని చెప్పుము — చెప్పెదవా?

సేవ. ఆపె లేచితిరుగుచునేయున్నదండి. ఇచ్చటికిఁదిరుగునేని మీరిచ్చు నాయమసన్నిధానమున వెలిపుచ్చెద.

కాన్స్య. మంచివాఁడ, నాపని సేయుము.

[సేవకుఁడు నిష్క్రమించును.

ప్రవేశము:— అయాగుఁడు.

కాన్స్య. తే॥ మంచి సమయమునం దరుదెంచితోయి.

అయా. పడుక కే యరుగక యుంటివా, సుమిత్ర!

కాన్స్య. పడుక యెక్కడ? నే నిను విడిచినపుడె
తెల్లవారె. అయాగ! నీ తెలవ నిప్పు
డిచటికిం బిల్వఁ బంచితి, నెట్టులేని
దశదమానను దరిసింపఁ దరుణమొప్పఁ
జేయుమా యని కోర; నెచ్చెలి! క్షమించు.

అయా. ఆపె నిచ్చటి కిప్పుడ యంపువాఁడ;
మూరు నావెంటఁ దోడ్కొనిపోయి, నగళు
బయట నుంచు నుపాయముం బన్నువాఁడ —
స్వేచ్ఛగా నీదు మనవి చెప్పికొనఁజెల్లు.
కాస్యు. వందనము గొమ్ము, సుహృద! [అయా. నిష్క్రమించును.
నా బంధువర్గ
మందు నింతటి దయగల యతఁడు లేఁడు.

ప్రవేశము:— యామిలి.

యామి. నెమ్మి కల్గుత! యువనాథ! నీకు దొసఁగు
పొసఁగెనని వినుటకుఁ జింత మెసఁగె నాకు;
ఇప్పుడిప్పుడె నాయకుఁ డింతియు నిను
గుఱించి మాటాడుచుండిరి; కొల్వునందు
నిను మరల నిల్పఁగా వేఁడికొనుచు నుండె
నల దయామతి; పల్కె నాయకుఁడు నిట్లు:—
పైప్రసున ఘనమైనయశమ్ముఁ గాంచి,
మేటి బంధువర్గమ్మును మిత్రకోటి
గల్గు నతనికి నీచెయ్యిఁ గంటు గల్గెఁ
గాన, నిన్నుఁద్రోయఁగా విధి గల్గెఁగాని,
నీపయినిఁ బ్రేమ యాతని నెమ్మనమునఁ
గల దటంచును మఱిమఱి తెలిపినాఁడు;

తరుణ మమరినతోడనె మరల నిన్నుఁ
గొల్వనం గొనునట్లు వాక్రుచ్చి, యే సి
పారనుం బని లేదని పల్కినాఁడు.

కాన్స్య. అయిన, యామిలి! ఒక్కసాయ మ్మొనర్ప
వలయు; — తగునని నీమదిఁ దలఁతువేనిఁ,
దరుణ మబ్బిన యేనియు దశదమూన
యొంటిపాటు దర్శనము నాకొక్క నిముస
మొప్పఁ జేయుము, నాగోడు చెప్పికొనఁగ.

యామి. రమ్ము లోపలి; కెవ్వరు రానిచోట
నిన్ను నిచి దేవి సంపెద; నీ హృదయము
సకలమును దెల్పికొనుటకు సమయమొసఁగు.

కాన్స్య. యామిలీ! అది దొడ్డ సహాయ సుమ్ము!

[నిష్క్రమింతురు.]

---

రంగము ౨. — సైప్రసు, కోటనగరులో ఒకగది.

—:o:—

ప్రవేశము:— అఖిలుఁడు, అయాగుఁడు, పౌరులు.

---

అఖి. తే॥ ఇవిగో! ఈ లేఖలను గొని యిప్డె యంపు
నావికుని వశమున నిచ్చి; నావిధేయ
వందనమ్ములు తెల్పుము ప్రగ్గడలకుఁ;

బిడప నగలియుము—కోట వెలిబురుజుల
మీఁద నుందును.

అయా. ఆనతిమేర నడతు.

అధి. అయ్యలార! యీబురుజుల కరుగుఁడింక.

పౌరు. చిత్తము, మహాప్రభూ! పరీక్షింపుఁ డిపుడు.

[నిష్క్రమింతురు.]

---

ద్వితీయ సంధి *

——:o:——

ప్రవేశము :—సూత్రధారుఁడు.

ద్వి॥ ముసలివానినిఁగని మూతులు విఱిచి
కసరకుఁడయ్య యో ఘనమతులార!
అధిలునిలేఖల నంది యానావ
రథవేగమొప్ప నీరధిపైన వెనిసు
పురికయి పఱచెడిఁ; బోవలె నింక
నిరువారములకాల మిక్కుఁ జేరంగ;
ఈ లేఖలం దేమి యెక్కువల్ గలవు?
ఆలముల్ ముగిసె నత్యాశ్చర్యముగను,
శత్రునావలు మున్గె సంద్రమ్మునందు,
చిత్రమ్ముగా నేము చేరితి మిటకు

* నాటక ప్రదర్శనమున దీనిని వదలి వేయవచ్చును.

ఏడెనాళులలోన నే హానిఁ గనక ;
ఈడ నంతయు భద్రమే, యింక శత్రు
భయమన్న మాట స్వప్నమునందు లేదు ;
అయినను బురుజుల నన్నిటిఁ జక్కఁ
బఱుచుచున్నాఁడ, లోపము లెల్ల దిద్ది
సరిచేయువాఁడఁ దక్షణము — యిట్లనుచుఁ
దెల్పనేకాని యఖిలనాయకుండు
తెల్పఁగాలేదు రాత్రి పొసంగినట్టి
గలిబిలి మాటయుఁ గాస్యనిమాట ;
తలఁచె నాతండు మంతనుని గాయనులు
నిమ్మళించిన వెన్క నెమ్మది నతని
సమ్మతిలోఁ గాస్య క్షమియించి కొల్వు
నన్నిల్ప ; దశదమానకు నక్లె తెల్పె.

*  *  *

విన్నారుగద మున్ను వెనిసునవార్త—
పిన్నయ్యయును లాదవీకుండు వచ్చు
చున్నవారిట, కదే, యోడ కనుండు !
పక్షము గడవ సైప్రస్సు చేరుదురు,
వీక్షింపఁగలరె భవిష్యత్తు తెఱఁగు ?

ఈ నెలదినములు నేరీతి దశద
మానయుఁ బతియుఁ బ్రేమల పెంపుఁ గనిరి,
ఒప్పెనే జయము కాస్యుని యత్నమునకు,
ఎప్పగిది నయాగు హృదయమ్ము తృప్తిఁ
గనియె, రుద్రగుఁడు నెక్కరణిని సహాన
మునుదాల్చి యాసతో మఱియుచున్నాఁడు -
ఇదియెల్ల మీర లూహించుకో వలయు,
విదితమ్ముకాదు మీ వీక్షణమ్మునకు ;
నడుమంతరమున దంతయు దాఁటిపోయి
కడపటి దివసమొక్కటె కానవచ్చు ;
ఆనాఁటి యఱిముఱి యది పల్కశక్య
మౌనె, చూడుఁడు, హృదయమ్ములు చీలు !

* * *

ఆదినుండియు దేవి కథిలనాథునకు
భేద మొనర్చి తృప్తిం గాంచఁగోరు
ఘోర రాక్షసుఁ డయాగుఁడు పన్నినట్టి
క్రూరతంత్రములు కన్గొన నేరితరము ?
ఒక రాత్రిలోనె కాస్యుని కొల్వుఁ గూల్చి
తికమకల్ సేసిన తెఱఁ గెఱింగితిరి ;

మఱునాటియుదయమ్మె మానినితోడ
మొఱవెట్టికొని తనముప్పుఁ దీర్చికొను
త్రోవసూపించి మిత్రున కుపకార
భావమ్ము మెఱయఁగాఁ బడఁతి యామిలి స
హాయమ్ము సమకూర్చె, నది కంటిరి కద !
ఆ యుదయ మయూగుఁ డఖిలనాయకునిఁ
దా నెన్నియున్న విధమ్మున, దశద
మానఁ గాస్యుఁడు బలిమాలెడి తఱిని
నగరులోనికిఁ జేర్చెనా ? చేర్ప లేదు ;
పగఁబూని పాడుదైవముకూడ నూత్న
దంపతులను గూల్పఁ దలపెట్టియుండ
సంపూర్ణ ఫలమొప్పఁజాలని వేళఁ
గొనసాగునే అయూగుని జతనమ్ము ?
తను నమ్మియున్న రుద్రగునకు నుదయ
కాలమునఁ బెన్పఁ గఱపినయట్టి
తాలిమి తానిప్డు తాల్పంగవలసె !—
సహన మవశ్యమ జయమున ; కైన,
దహియింపదే యది తన హృదయమ్ము ?—
ఏలా గయూగుఁ డివ్వేడ నోర్చియుండు ?
ఆలు లభించి నాయకునకు హాయి

తలకూడె ; నయ్యయో ! తానెందు తలఁపఁ
దలఁచె దైవము వేఱ్వేఱమ్మున ! కాన్య
నకుఁ దెల్పినట్టి మంతనము నాతనికి
అకటకటా ! మేల యబ్బంగఁ జేసె
మంతను గాయముల్ మానిన వెన్కఁ
జింతఁబాయుదువయ్య, సేనాని నిన్ను
మన్నించి కొల్వున మఱి నిల్పఁగలఁడు,
కొన్ని దినము లోర్చికొనియుండు మనుచు
దేవి తెల్పఁగ వగ తీఱు టబ్బురమె ?—
ఏవిధమ్మున దయ్య యిది సహించు ?
అప్పురమునఁగల యన్నవ లెల్ల
ముప్పిరిగొను మోదమున నమ్మదర్శ
నము చేసికొని మన్ననల్ పెద్దగనిరి ;
అమయును వారి గృహమ్ముల కరిగి
సేమ మారసి తన చెలిమిని నెఱపె ;
ప్రేమతో నెల్లర హృదయముల్ నిండె ;
ఎచ్చోటి కరిగిన నింతి మేల్గానము
మెచ్చులె, అఖిలుని మేటిభాగ్యమ్ము
ముచ్చటలే, వారిపొందు పొగడ్త—
లెచ్చోదప్పన నయాగుఁ డిది కని యోర్చు ?

చాఁగురే! బ్రహ్మరాక్షసి యేనిఁ జుల్కఁ
గాఁ గోరినఁ బందుగ లభింపఁగలదె?
ఎన్నెన్ని మాయల నియ్యాయోగుండు
పన్నెనో మీకుఁ దెల్పఁగ నేరితరము?
కలఁడు కాస్యునకు వేశ్యచెలి యొకర్తు,
వలపుకత్తియ, పేరు బాణక; అతని
జంట దానింటికిఁ జనియె నయోగుఁ;
డంటుకాఁడని తెల్ప నదియును మెచ్చి
మచ్చికమీఱ సమ్మానముల్ సేసె;
అచ్చెరువుగ మైత్రి యంతలో నెఱపి
లేమకు నొకయంగుళీయక మతఁడు
ప్రేమమై నొంటరివేళ నొసంగి—
కొమ్మరో! దీని నా గుఱుతుగ నుంచి
కొమ్ము నీయొద్ద, నీ కూరిమికాని
కెన్నఁడు చూపకు, మెట్టి మిత్రులకు
అన్నలపట్ల రహస్యమ్ము వలయు—
నని తెల్పె.—అంగుళీయక మల్లరుద్ర
గుసిది, యాతని పేరు గుఱ్ఱు కన్పట్టు;—
తగియుండదే విరోధము పొసఁగింప?
ముగురికి వహ్వారే మూడదె కీడు!

ఇంతటి నాఁగనే యీ మహాత్ముండు?
మంతనుఁ గాంచి సేమమ్ము నారయుచుఁ
జింతతోఁ గాస్యుని స్థితియెఱింగించి
సంతసమ్మునఁదెల్పు స్వల్పకాలమున
మేలౌనయని; మఱి మిత్రునిఁ బొగడు
జాలియుఁ బ్రేమయుఁ జాలఁ దోఁపింప;—
ఇది యెల్లఁ గాస్యున కెగ్గు పొనర్ప
మదినెన్ని పన్నిన మాయతంత్రమ్ము.
తనయాలు సేని సుంత ప్రియమ్ముతోడఁ
గనునె యీతండు? నిష్కారణమ్ముగను
జీటికి మాటికిఁ జీవాట్లువెట్టి
బోటిని మొత్తగ మొత్తు నెక్కుడు;
చెట్టసేయఁగఁ బంచుఁ, జేయకయున్నఁ
దిట్టుచు సతము వేధించుచునుండు;
చెల్లరే! యీతని చేతను జిక్కి—
అల్లయామిలియు సౌఖ్యము నెట్లు కాంచు?
ఇరువది రెండు నా ళ్లేఁగె, నీ లోన
నిరుతడవలు లభియించెఁ గాస్యునకు
దశోదమానాదేవి దర్శనమ్ము; విధి
వశమున నవుడు నిష్ఫలమై అయాగు

జతనమ్ము చెడఁగ విచారమ్ము మీఱి
అతఁడు వేఱొక యుపాయము పన్నఁదొడఁగె.

*   *   *

తాలిమితోడ రుద్రగుఁడు నిన్నాళ్లు
మేలు కల్గున యని మిత్రునిమాట
నెఱనమ్మి దానిచిన్నెలు కానరాక
మొఱ యిడసాగె ; నప్పుడు ప్రేమమెఱయఁ
బలుకునయాగసర్పము నిప్పగిదిని :—
చెలువుఁడ ! యోర్పు తాల్చితివయ్య చాల ;
నరులము మనప్రయత్నములకు ఫలము
చెఱుపఁదలంచి యా చెనఁటి దైవమ్ము
యడ్డిన నేమిసేయంగలమయ్య ?
ఎడ్డమిఁగాంచిన నేమయ్యెఁ, గాన్యుఁ
డమ్మ సిపార్సున నఖిలు ననుగ్ర
హమ్ము సంపాదించె ; నతిశీఘ్రకాల
మున నిల్వఁగలఁడు నూ ముందటికొల్వు
నను — విఘాతమ్ము నొనర్పఁగావలయు ;
నాఁటియటుల నేఁటి నడిరేయి నీవు
కోటగంటను మ్రోసి గొల్లున గోల

పుట్టింపుమయ్యా యిప్పారమున, దాన
నెట్టిలాభమొ వెంటనే చూడఁగలవు.

* * *

అ య్యామవసనిసి నైనట్టిగోల
కెయ్యదిమూలమో యెట్లే నెఱుంగఁ
గాఁగోరి, యటుమీఁదఁ గావలియం ద
యాగునితోడ నాయకుఁడు తాఁ గొన్ని
రాత్రులునిల్చి ఠేర్పఱిచెను; గాస్యఁ
డాత్రమునఁ వేఁడినది వెనుకయ్యె.
ఇయ్యదనునఁగదా హితుని సహాయ—
మయ్యయాగుఁడు వీడునా చెలికాని?
పలికెనతఁడు కాస్యఁ బరికించి యిట్లు—
గలిబిలి కంటివి కాదె, సుమిత్ర!
తెలియదు కతము, సందియము జనించెఁ
గొలువున నినుఁ జేర్చికొనఁబోవు కతనఁ
గలహాపుయోజన గలిగెనో యనుచు;
చెలువుఁడ! నను లెక్కసేయుదు వేనిఁ
బది దివసమ్ములు బాణకహొత్తు
వదలియుండుము, దానిఫలముఁ గాంచెదవు;

నిదురించుమా యిఁక నీయిక్క యంద,
అదను కల్గినయప్డు డమాదర్శనమ్ము
చేసి నీ గోడెల్ల చెప్పికొనంగ;
మోసమకా నాలస్యమున నిటుపయిని,
వేగ నీ కొల్వు నిప్పించకయున్న ;—
ఈ గతి మిత్రుని హితబోధ నంది
కాస్యుఁడు దేవినిఁ గాంచి వేఁడుచు ర
హాస్యమ్ముగా నంగలార్చుట వినుఁడు!
నాఁటికి వారముల్ నాలుగు సెల్లె;
బోటి పిన్నయ్య యాప్రొద్ద రాఁగలఁడు;
కటకటా! లేశ మక్కటికమ్ము లేక
కటికదైవముసేయు గత్తర కనుఁడు!

---

రంగము 3.

సైప్రస్సులో.— కోటనగరున ఒక వసారా.

ప్రవేశము:—దశదమాన, కాస్యుఁడు, యామిలి.

---

దశ. తే॥ భయపడకుమయ్య, కాస్య! నీపట్ల నా ప్ర
యత్న లోపము కలుగనీయనని నమ్ము.
యామి. అమ్మ! దయగలతల్లి! యెట్లయిన మే లొ
నర్పఁగదవమ్మ; యిప్పట్ల నా యతండు

తనకు నగచాట్లు కనినట్ల వనరుచుండు.

దశ. అతని హృదయమ్ము దయగలదౌను.—కాస్య!
తొఱఁగుమా సంశయమ్ము, నాథుఁడును నీవుఁ
దొంటియట్ల మిత్రులుగ నుందురని నమ్ము.

కాస్యు. కరుణగలతల్లి! ఒకటి నిక్కముగ నమ్ము —
కాస్యునకుఁ దుది నేగతి కలుగనున్న
అతఁడు సతము మీదాసుఁడై హితము కోరు.

దశ. అది యెఱుంగుదు; వందనమయ్య, కాస్య!
నాథునెడ నీకుఁ బ్రేమ ఘనమ్ము; పెక్కు
నాళ్ల పరిచయమౌను; జింత విడుమయ్య,
నీయెడల నాయకుండు విధాయకమ్ము
కలుగువఱ కిటులుండునేగాని, పిదపఁ
గరుణ నెప్పటియట్లు నిన్ గాంచుఁ జుమ్ము.

కాస్యు. నిశ్చయమకాని, దేవి! యే నెపమయేని
ఆ విధినిఁ బెంచి పెద్దసేయంగ నోపు;
స్థానమునఁ బెక్కునాళ్లు నేఁ గానకున్న,
నాదు సేవయుఁ బ్రేమయు నాయకుండు
మఱవఁగూడున యని మది వెఱచువాఁడ.

దశ. సీ॥ వలదయ్య వెఱపు, నీ కొలువు నిప్పింతు, యా
మిలి సాక్షినిల్చు నిప్పలుకునకును;

వినుమేను హితభావమునఁ గార్యమును బూని
నట విడనయ్య యంతమ్ము దనుక ;
సమయము కాదని సంశయింపక యిఁక
నేఁ బ్రొద్దు నీ సుద్ది హెచ్చరింతు ;
పలుకాడు వేళను బనుల వేళను బువ్వ
గుడుచు వేళను మఱి పడుక వేళ,
ఆ॥ అన్ని వేళలందు నర్థింతుఁ గాస్యుని
గొల్వ, వేఱొకండు కోరనయ్య ;
ప్రాణనాథున కిది పాఠంబుగాఁ జేతుఁ,
జింతవిడుము, జయము చెందఁగలవు.

యామి. తే॥ అమ్మ ! నాయకుఁ డల్లదె యరుగుదెంచు !

కాస్య. దేవి ! యే నింక సెలవు ప్రార్థింతు నమ్మ.

దశ. ఏలపోవలె ? నిలువు, మేలీల నిన్ను
గుఱించి భాషించుదాననో కొంత కనుము.

కాస్య. ఇపుడు కాదమ్మ, తల్లి ! యే నిచట నిల్వ
నోపు స్థితియందు నాచిత్త మొప్పదమ్మ.

దశ. అటులయేని నీ యిచ్చకు నడ్డుపల్క. [కాస్య. నిష్క్ర.

ప్రవేశము :—అఖిలుఁడు, అయాగుఁడు.

అయా. అజ్జరే ! యది తగద !— [తనలో తా ననుకొన్నట్లు]

అఖి. ఏమంటి విపుడు ?

అయా. అయ్యా! యేమియు లేదయ్యా!—

[తనలో తా ననుకొన్నట్లు] అతఁడు కాఁడ

యేని — మఱియేఁడో యూహింపలేనివాఁడ.

అధి. ఆదెసను దేవి వీడ్కొని యరిగినతఁడు

కాన్యుఁడే కాదె?

అయా. నాయకా! కాన్యుఁడంటె?

కాఁడు, కాన్యుఁడు కాఁడు, నిక్కమ్ము; కాన్యుఁ

డప్పగిది ప్రముచ్చువలె నేటి కరుగు మిమ్ముఁ

గనినయంతనె?

అధి. కాన్యుఁడ యని తలంతు.

[అయాగుఁడు కొంచెము దూరమున నిలుచును.

దశ. రండు, ప్రాణేశ! యీ నిమిషమ్మునందు

మీదయకు దూరుఁడై, గాసి మీఱి, రక్ష

ణమ్మడుగు నర్థితో భాషణమ్ము సల్పు

చుంటి.

అధి. అతఁడెవఁడో?

దశ. ఎవఁడోయనంగ

నేల? యువనాయకుఁడు కాన్యుఁడే కదయ్యా!

ప్రాణనాథ! ప్రేమకుఁ గృపఁబడయు బలిమి

కలదయేని నామొఱ విని కాన్యు నిపుడ

పిలువనంపించి కొలువున నిలుపుఁడయ్య;
అతఁడు మీయెడ నిజము ప్రియమ్ము కలఁడు,
తెలియక పరాధ మొనరిచెఁ దెలిసికాదు —
అతని ముఖలక్షణమ్మున నది విశదము;
వేఁడికొందు, నాతనిఁ బిలిపించుఁ డయ్య.

అఖి. ఇప్పు డాతఁ డెయ్యెడనుండి యేఁగె నొక్కొ?

దశ. ఔను, వగచే డిగంబడి యణఁగిచనియె,
అతనిచింత యొకింత నా కంటికొనఁగ;—
ప్రాణనాయక! పిల్వఁగఁ బంచుఁడయ్య.

అఖి. ప్రియ, దశదమాన! యిప్పుడు వేళ కాదు,
మఱి యొకప్పుడు కానిమ్ము.

దశ. తొరగనెకద?

అఖి. ప్రాణమా! నీవు కోరు కారణముఁ జేసి
మిగులఁ ద్వరగనె కానిమ్ము.

దశ. మేలు, మేలు!
కూడునే నేఁటిరాతిరి కుడుపువేళ?

అఖి. నేఁటిరాతిరి వలదు.

దశ. ఒకనాఁటి కేమి,
వలనగునె యెల్లి పగటిసాపాటువేళ?

అఖి. కోటలో నెల్లి కప్తాన్లు కూడి విందు

సేయుదురు, వారితోడ బోసేయువాఁడ.

దశ. అటులయిన రేపురాతిరి ; అదియుఁగాక
పై దినము రేపుఁబొద్దో, ఆ పవలో, మాపొ ;
అదియుఁగాకున్న బుధవార ముదయమందో,
కరుణ మెయి నియమింపుఁడు కాల మొండు —
మూఁడు దినములలోన కా వేఁడికొందు.
పెఱలు బుద్ధిఁగొనం గనికరము లేక
దురములం దెట్టి మేటి యోధులన యేని
దండనలకు లోఁబఱుచుట తక్క, నిక్క
మరసిచూడంగఁ గాస్యుని మైపదెంత ?
చాటుఁజీవాట్లుఁ బెద్దశిక్ష యవునయ్య !
అయినఁ దన కొద్దితప్పిద మతఁడు గొప్ప
గాఁ దలంచితలంచి వగఁ మునింగి
నాఁడు, మన్నించి కొల్వునన్ మఱి కొనుండు.
ఎపుడు రమ్మందురో వచియింపరయ్య.
ఎంతయబ్బుర, మయ్యారే ! యింత సేపు
నిశ్చయము తెల్ప ; రిట్లు పంౘ్రెండుసార్లు
మిమ్ము బతిమాలవలెనె యీ మేలు కొఱకు ?
మీరు నన్నేమి కోర నీ తీరునఁ బలు
మాఱు దైన్యముతో బతిమాలఁ జేసి

కొందునో మది నూహించికొనఁగఁ జాల;
మమ్మ! మనపెండ్లిరాయబారమ్మునందు
ఎన్నితడవలు నాయొద్ది కితఁడు వచ్చె,
నెన్నితడవలు నే మిమ్ము నిష్టపడక
మొగ్గులెన్న మీపట్టు వహించిపల్కె! —
ఇట్టి వానినిఁ గొల్వునఁ బెట్టికొనఁగ
నింతయోజన వలసె, బలే! సెబాసు!
ఇతని సాయములో వీసమేనిఁ జేసి
యున్న యతనికిఁగూడ నే నొప్పఁజేతు
నయ్య —

అఖి. ఇఁకఁ జాలు; నాతని యిచ్చవచ్చి
నపుడు రమ్మను, నీమాట కడ్డుసెప్ప.

దశ. కం॥ బళిరా! వరమిచ్చుట కాఁ
దలఁచితిరా యేమి, యింత తడవయ్యెను మీ
పలుకు వెలివడఁగ; నాథా!
స్వలాభమును గైకొనంగ జాగుక్షేమేలా?

ఆ॥ మంచి చేలమును ధరించుమా యనుట, మే
లోగిరమ్ము కుడువ నొల్లుమనుట,
హాయిఁగూర్చు పనిని జేయుమాయనుట, కా
న్యునకు మరలఁ గొల్వు నొసఁగుమనుట.

ఆ॥ మీకు దశదమాన మీఁద నెప్పెడి ప్రేమ
మేరఁ గనుఁగొనంగఁ గోరినపుడు,
నాల్గుగడెలు యోజన యొనర్చి తడఁబాటు
తోడ నీఁదగినదె వేడికొందు!

అథి. తే॥ ఏమికోరిన నీకెడ్డ మెపుడు పల్కఁ
జుమ్ము! బతిమాలుకొందు నిచ్చోట నిముస
మొంటిపాటున నుంట నాకొసఁగవలయు.

దశ. అడ్డి సెప్పదునే భవదర్థితమున ?—
కిదె యిచటినుండి తరలితి నీ నిముసము;
వందనము, ప్రాణనాథ!

అథి. నా ప్రాణధనమ!
వందనమ్ము! క్షణమ్ములో వచ్చిచూతు.

దశ. యామిలీ! రమ్ము.—నాథ! మీ యాజ్ఞమేర
కరుగుదానను, స్వేచ్ఛమై నలరుఁడింక.

[దశదమాన, యామిలియు నిష్క్రమింతురు.]

అథి. ఆ॥ పెన్నిధానమ! నినుఁ బ్రేమింపఁగల్గి నా
యాత్మ స్వర్గసౌఖ్య మందుటయ్యె;
అల్ల ప్రేమమునకు నంతమొప్పిన జగ
త్ప్రళయ మెసఁగి యిరులు గ్రమ్ముకొనదె?

అయా. తే॥ అయ్యొ, నాయక!

అఖి. ఏమి, అయూగ! యేమి?

అయూ. మీరు దేవినిఁ బెండ్లాడఁ గోరి ప్రేమ
నెఱపుచుండుట కాస్స్యన కెఱుకపడెనె?

అఖి. అతని కెఱుకయె దాని యాద్యంతమెల్ల; —
ఏల యిట్లడిగితివి?

అయూ. మఱేమి లేదు,
నా తలఁపు సరిపోల్చుకొనంగ నయ్య.

అఖి. తెల్పు మది యేమి?

అయూ. కాస్స్యఁడు దేవి పరిచ
యమ్ము గలఁడని నాయూహయందు లేదు.

అఖి. పరిచయము మెండు; మాటిమాటికి మాదిఁ
నుండి నడపిన దూత యతండె.

అయూ. అటులొ!

అఖి. అటులొ! నిజముగ నటులయా, నందు సొక్కఁ
గందువా?కొ,సత్పురుషుఁడు కాఁడొయతఁడు?

అయూ. సత్పురుషుఁడు!

అఖి. పల్కు మతండు సత్పురుషుఁడు
కాఁడొ?

అయూ. కాఁడని యెట్లు పల్కఁగలనయ్య!
ఎఱుఁగు వఱకు సత్పురుషుఁడం చెప్ప గలను.

అథి. ఎన్నుట యటుండనిమ్ము, నీవేమి తలఁతు ?
అయా. ఏమి తలఁతున, నాథ !
అథి. హా ! యేమితలఁతు
ననుచు నానుడులే ప్రతిధ్వనిగఁ బల్కు-
చున్న వాఁడవు ; నీమది నున్న దేదొ
బ్రహ్మరాక్షసియో హా, చూపంగరాని
దయ్యపుఁ దలంపు, నీవాకు వ్యర్థమేట్లు ?
దేవి పీడ్కొని కాస్యుఁడు పోవుటఁగని
అజ్జరే ! యది తగదని యంటి విపుడ—
తగని దెయ్యది ? మాదూతయగుచు నాది
నుండి కార్యము నడపె నతం డనంగ,
అటులో ! యనిపల్కి కనుబొమల్ చిటులఁజేసి
మోము ముకుళించుకొంటి, వదేమొ ఘోర
భావము మనమ్ములోపలం బర్విన ట్లు ; —
నిక్కముగ నాదెసను బ్రేమ నిలిపెదేనిఁ
దెలుపుమోయి నీతలఁపుల కలతెఱంగు.
అయా. నాథ ! నీపయి నాప్రేమ నమ్మెదుగద ?
అథి. నమ్మెదను ; నీదుహృదిని బ్రియమ్ముకలదు
మంచివాఁడవటంచు భావించి, లెస్స
యోజన యొనర్చి కాని యీయోజఁ బల్క-

వని యెఱుంగుటచే ఘనమయ్యె నీదు
తెలిపి తెలుపని తలఁపుల వలని భయము ;
తెక్కలి గులాముసందు నీ శక్తియెల్ల
బూటకపు వేసమై మోసమును ఘటించుఁ
గాని, సద్వర్తనము కలవానియందు
హృదయమున డాఁగియుండక యెదురు తిరిగి
వెలికిఁ బ్రసరించు కలుషవిద్వేషచిహ్న
ములుగ భావింపకున్నఁ గీడొలయకున్నె ?

అయా. అయ్య, నాయక ! సత్యవాక్యమని తలఁచు
మయ్య ! కాస్యుఁడు సజ్జనుండనియె తలఁతు.

అఖి. ఏను నటుల తలంతు.

అయా. జగాన, నరులు
వెలికిఁ గన్పట్టు వితమున వెలయఁబోలు ;
వెలయఁబోలనివారల వెలివితమున
నేమి తెలియకయుండిన నెంతొ మేలు.

అఖి. ఔను, నీ నుడి సత్య ; మయాగ ! నరులు
వెలికిఁ గన్పట్టు వితమున వెలయఁబోలు.

అయా. ఐనఁ, గాస్యుఁడు సజ్జనుఁడనియె తలఁతు.

అఖి. కాదు, నీమాటలం దనుమాన మొప్పె ;
కలదు దాపఱికమ్మిందుఁ బలుకు మదియు,

ఎట్టి కసుమాలమే సంశయింపవలదు ;
క్రచ్చఁదలఁపులఁ దెలుపుము రొచ్చునుడుల.

అయా. ఉ॥ దాసుఁడనయ్య, మీ పనుపు తప్పక చేయ
విధాయకమ్ము క* ద్దే సరి ; నాయకా ! కలదె
యెట్టి దోసంగుఁ దలంపు నేనియుఁ * మోసము
కల్గునాక, భయముఁ విడి తెల్ప విధాయకమ్ము?
నే*బాసు ! మజారె ! యొప్పదది బానిస కేనియు
నెట్టి పట్టునఁ.

క౦॥ కసటుం దలఁపులు నూహాలుఁ
బొసఁగునె వెలిపుచ్చ? చిత్తమునఁగల్గుటయుఁ
దోసఁగే కాఁజెల్లిన, మా
నసమున మక్కొన్న నట్టి నరులుం గలరే ?

ఆ॥ ఎట్టి దివ్యసౌధ మేని లోలోపల
గుట్టుగాను మట్టి గూడియుండు ;
ఎట్టి స్వచ్ఛహృదయఁమే నంతరాళము
నందు మైలఁగాంచు టరుదుకాదు.

అధి. ఆ॥ మిత్రునకు, నయాంగ ! మేటి ద్రోహము సేసి
నాఁడవౌ, దతనికిఁ గీ డెంచెంగి
యేని నూహ నెన్ని యేనిఁ దెల్పక నీదు
తలఁపు లతని చెవికి దవ్వుపఱుప.

అయా. సీ॥ నాథ! నన్ మన్నించు, నాయూహ యొకవేళ
దుష్ట మార్గమ్మును ద్రొక్కఁబోలు ;
వంక లెన్నెడి స్వభావముచేత నేనెప్పు
డొరుల తప్పులె యెన్నుచుందునయ్య ;
నాయనుమాన శనైశ్చర మొక్కెడ
లేని దోసములును లెక్కవెట్టు ;
ఆత్రగాఁడను, జ్ఞాన మల్పమ్ము, నా దురూ
హలను మీ రరయుట యనుచితమ్ము ;
తే॥ నిశ్చయ మొసంగనట్టి నా నిర్ణయములు
తెలుపుటొప్పదు ; కష్టముల్ వెలసి మీకు
హాయి సెడునయ్య, నాకు దుర్యశము పొసఁగు;
తగద పౌరుషమునకు సత్యమునకేని.
అథి. తే॥ స్పష్టపడదయ్యె నీమనోభావ మిందు.
అయా. చం॥ పురుషునకున్ — సతీమణికి — భూరియశమ్ము
సుభూషణమ్ముగాఁ * బరఁగుచు వారియాత్మలను
భాసిలఁజేయు ; ధనమ్ము చెత్త — నేఁ * డొరుని
గులాము, రేపు మఱియొక్కనితొత్తటనీదినాది;
పోన్ * దొఱఁగును గొద్దిగొప్ప, యది దొంగకు
లాభము; మద్యశమ్ము త * స్కరణముసేయఁగాఁ
బడిన సర్వముపోయినయట్లనాకుఁ,ద * స్కరు

నకు దానిచేఁ బదపికల్గదుసూలవలేశమేనియుఁ.

అధి. తే॥ దైవసాక్షి ! నీహృదిఁ గల తలఁపులిపుడు
తెలిసికొందును గాక.

అయా. అది వలనుపడదు
నాదు హృదయమ్ము మీచేత నాటియున్న—
నాయధీనమ యై యుండ నడచు టెట్లు ?

అధి. హా !

అయా. అహా ! నాథ ! అనుమానమంటఁ బడకు ;
పచ్చకనులపిసాసి యా పాడుఁదెవ్వులు
కూడు కల్పించికొని బ్రతుకుచును బెఱుగు ;
గుణమెఱిఁగి ప్రేమవిడిన జారిణి విభుండు
హాయిఁగన నొప్పునేకాని, యక్కటకట !
ఘోరనరక వేదనఁబడి కుందుచుండుఁ
బ్రతి నిమేషము తనసతిపైనఁ బ్రేమ
నెఱపుచును మది నరగలిఁ బొరసి మఱలఁ
దొలఁగుచు భ్రియముంచుచు వెఱచు నతఁడు.

అధి. కటకటా ! యెట్టి దురవస్థ !

అయా. కల్లుదాని
తోడి తృప్తియు సంపదతోడ సమము,
పరఁగు నదియ సంపదగఁ బేదఱికమైన ;

కాని, మితిలేనిసంపద గలిగి సతము
పేదఱిమి చెందునని మది వెఱచువాని
కలిమి యది నిజముపేదరికమ్ము సుమ్ము;
దైవమా! అనుమాన భూతమ్మునుండి
తొలఁగఁజేయుమ నాదుబంధువుల హితుల;
వైరులకు నలవెఱఁ బాపఁ గోరుకొందు.

అఖి. ఉ॥ ఏమిటికీ నుడుల్? తలఁచెదే జాలజారికళాను
సారినై * నామదిఁ బ్రేమ పెంచుచు నణంచుచు
నిచ్చలు సందియమ్మునం* దేమనుచుందునంచు?
వినఁమిగా, యొక యిం తనుమాన మొప్పినన్ *
దామస మత్తఁగా నియక తథ్యము నేర్పడఁజేసి
యొప్పెదన్.

సీ॥ గాలి యూహలను లెక్కకుఁగొని చిందిలి
పడుచుఁ గుందఁగ వెఱ్ఱివాఁడఁగాను;
నాసతి చక్కదనమ్ము బాసలనేర్పు
నాటపాటలనెఱసీటు, నివ్వి
సుగుణమొప్పెడిచోట సొబగుపెంచునటంచు
నెంచెద, సందియ ముంచుకొనను;
నాలోపముల గణనముసేయ, నవి కని
యును నను వరియింప నొప్పెననుచు;

తే॥ విను, మయూరాంగ! సందియమును గొనక మునుపు
చక్కఁజూతున; కొనినంత జాగు లేక
నిర్ణయింతున యటొ యిటొ; నిర్ణయమున
కవలనెక్కెడి ప్రియమొ సందియమొ విడుతు.

అయూ. సీ॥ నాయకా! నాకు సంతసమయ్యె నీదు ప
ల్కులు విన, నింకఁ బల్కుటకు నులుక;
నాయనురాగ విధాయకమ్ముల బడి
మీయెడ ధైర్యమ్ము మెఱయ నడతు;
ఇది నిదర్శనమని యిపుడు వచింపఁ; గా
న్యుని పట్ల మీసతి నోరగంటఁ
గనుఁ—డిట్లు—చాటుగ; ఘనులు మీయట్టి స
జ్జనులకు మోసము సైఁపఁజాల;
తే॥ ఎఱుఁగ నెక్కొ మావారి సంకరగుణమ్ము—
భర్తలకు డాఁగురించి దైవమును జూడ
నిత్తురు వెనీసుజాణలు జిత్తులాఁడు;
లఘుముఁ దోఁఱఁగరు, డాఁచుటయె ఘనమంత్రము!

అథి. తే॥ పల్కెదే యట్లు?

అయూ. నాథ! యబ్బఁ గనుఁ బ్రాబి
మిమ్ముఁ బెండ్లాడె; మిమ్ము భయమ్మునఁ గను
నటుల నటియించి ప్రేమించె నగ్గలముగ!

అథి. అది నిజము.

అయా. పల్కనేమిటికయ్య ; యింత

పిన్నతనముననే యిట్టి పన్నుగడలు

మోసములు నేర్చె ; పాప, మా ముసలివాని

కనులు గట్టిగఁగుట్ట, నెమ్మనమునందు

మాయమంత్రమయని భ్రమంపడియె నతఁడు !

[అథిలుఁడు విచారమునఁ దవిలి యెడమచేతితోఁ దలపట్టుకొని, కనులుమూసికొని యాలోచింపఁ బూనును.]

అయ్యో ! నే దూషణీయుఁడ నైతినయ్య !

మిక్కుటమ్మగు ప్రేమమై మిమ్ముఁగాంచి

నందులకు నను క్షమియించుఁ డయ్య, వేఁడి

కొందు.

అథి. ఇందుఁ గృతజ్ఞుఁడ నందు నీకు.

[కనులు మూసికొనియే అథిలుఁడు తన కరముసాచి అయాగుని కరముతో జోడించును. పిమ్మటఁగొంతతడవు నిశ్శబ్దముగ నిరువురు నూరకుందురు. అథిలుఁ డాలోచనమునఁ దవిలియుండును.]

అయా. నాథ ! మీ ధైర్య మొక్కింత నలఁగెనయ్య.

అథి. లేదు, లవమాత్రము నలంగ లే, దయాగ !

అయా. కాదు ; మీ మనశ్చలనము కానఁబడెడి ;

తలఁపుఁడీ, నాథ ! యీ నాదు పలుకులెల్ల

వెడలె మీ యెడ నే నిల్పు ప్రేమ ననుచు ;—

స్పష్టమయ్యెను మీ మది చంగలింపు ;
అయ్యా ! నా నుడులను సందియమ్ము వలదె
కొనఁదగును, దానికెక్కుడు కూడదయ్యా ;
అధికముగనెంచి కారాని యగవులేమి
తలఁప కుండఁగఁ బ్రార్థింతు.

అధి. తలఁపనోయి.

అయా. తలఁచితిరయేని, నాథ ! నా పలుకులందు
నే గణింపని ఫలము జనింపఁగూడదు ;
కాన్యుఁ డెవ్వఁడు, నా చెలికాఁడ యౌను —
అదిగో ! విస్పష్టమయ్యె మీహృదిబెడంకు.

అధి. అంతగా లేదు, స్వల్పము ;
[మోముపైఁ జేయిడీసి] — అయాగ ! దశద
మానను సుశీలగనె నాదు మదిఁదలంతు.

అయా. అటులె చిరకాల మాదేవి యడరుఁగాత !
అటులె చిరకాలము తలంచు టగుత మీకు !

అధి. ఐన, స్వాభావికమ్ము నేయంగున విడి——

అయా. ఔను, నాయక ! అదియె ముఖ్యము గణింప ;
ధైర్యము వహించి పల్కఁగఁ దగునయేని,—
పృథివిపై నన్నిటను నైజవృత్తి కనఁగ,
తనదు నాడు, కొలమ్ము, చందమ్ము కల్గు

నెందఱెందఱో కొమరుల నించదయ్యె;
ఇందుఁ గనరాదె మితిమీఱు స్వేచ్ఛ, పాయ
మునకుఁజెల్లని వర్తనమ్ము, కలకోర్కి ?—
గ్రుచ్చి నిశ్చయమని యాపెగుఱిచి పల్కఁ;
గాని, యా స్వేచ్ఛ, యవల నిదానమొప్పఁ
దన కొలమువారితో మిముఁ దార్చిపోల్చి
చూచికొని చింతఁగొనఁ బోలుఁజుండు, నాథ!

అఖి. ఇంక నీవేగు మిటనుండి; యెవ్వియేనిఁ
గ్రొత్త లెఱుకకు వచ్చినఁ దత్తఱమున
నాకుఁ దెల్పుము; ఓరగంటఁ గనిపట్టి
నీ సతిని నియమించుము, నీవకోరి;
పొమ్ము, నలవిడు మిఁక.

అయా. [పోవుచు] — నాథ! పోయివత్తు.

అఖి. ఏలపెండ్లాడి యే నిట్లు బేలనైతి!
సత్యసంధుఁడీతనికి గోచరమ దీని
కల తెఱంగెల్లఁ; దెలిపిన దలుప మగును.

అయా. [మఱలివచ్చి] —
నాథ! మిమ్మొండు వేఁడికొనంగవలతు;—
దీని పరిశోధనమ్మును బూనికొనక
విడుఁడు, సర్వము కాలము వెంటఁదెలియు.

కాస్యుఁడతి సమర్థుఁడు, చేరుఁగద కొలువున
నేఁడో యెల్లియొ, అయినఁ గొన్ని దివసములు
కొలువునం దొప్పకుండినఁ దెలియనోపు
నతని తెన్నులు నాతని హితుల తెఱఁగు;
చూడుఁ డాతనిగుఱిచి మీ జోటి యెట్లు
నెక్కినెక్కి సిపార్సులు వక్కణించు —
దాన నెంతెంతో తెలియంగఁ దగున; అంత
దనుక నా నుడు లూహాల యని తలంచి—
అటులఁ దలఁచుటయే క్షేమమయ్య నాకు —
నాతి నిర్దోషియట్లు యెన్నంగవలయు.

అధి. తలఁకుఁ గనఁబోకు నాదు వర్తనముపట్ల.

అయా. వందనము, నాథ! యింక పీడ్కొందు నిపుడు.

అధి. సీ॥ సత్యసంధుఁ డితండు సకల స్వభావమ్ము
లరసినవాఁడు కుశాగ్రబుద్ధి;
దాష్ట్యము స్పష్టమై తనరిన నాదు హృ
ద్రక్తనాళంపుబంధములనున్న
ఖండించి చెనఁటిడేగంబలె నా పెను
గాలివాటునఁ దనగతికి విడుతు;
చామనవాఁడనంచో, మృదువచనధో
రణియుఁ డక్కులుఁ డెక్కులును గొఱంత

ఆ॥ యనియొ వయసు పెద్దయనియొ—అదియునెంత,
ఏమికారణమ్మొ హీనతఁ గని,
నాకు నపయశమ్ముఁ జేకూర్చె నాయింతి,
ద్వేషభావమొండె దీనిశాంతి.

ఉ॥ అమ్మ! వివాహశాపమ! లతాంగులు మా ధన
మయ్యె, మాయధీ * నమ్ములె వారి కాంక్షలు
గుణమ్ములు? ఛీ! ప్రియముంచు నాపదా * ర్థ
మ్మున నన్యులంట నొకతావు భరించుటకన్నఁ
గొండ కూ * పమ్మున సర్పమై ముఱికివాయువు
బువ్వగ మంట యొప్పదే?

చం॥ అధికుల కింతులందుఁ గన నయ్యెడి బన్నము లో
ప్పచుండునే * యధముల కేని?— ఆ విధి నియా
మక మేసరి మృత్యువుంబలెన్; * బృథివి నరుం
డు గర్భమున నిట్టటు పొర్లుచునుండు వేళనే *
యధిగతమై లలాటమున కంటున జారిణిభార్య
పీడయున్.

ఆ॥ అదిగో! దశదమాన యలరుచు వచ్చెడి;
ఆపె గుణమునందు లోపమున్న,
తప్పుసృష్టి చేసె దైవమ్ము తనుఁదాన —
అమ్మ! నమ్మఁజాల! నమ్మఁజాల!

[ప్రవేశము:—దశదమాన, యామిలి.

దశ. తే॥ ఏమిటికి జాగు? రండు, ప్రాణేశ! నేఁటి
విందునకు మీరు పిల్చిన వీరలెల్ల
వచ్చి మీరాక వేచెడివారు; రండు!

అథి. తప్పు కల్గెను నాపట్ల.

దశ. చొప్పు మాఱె
ఏల హీనస్వరమ్ముల నిట్లు పల్కు-
వారు, స్వస్థతఁ గనరొ శరీరమందు?

అథి. నుదుట నిచ్చోటను రవంత నొప్పిఁ గందు.

దశ. కావలిని మేలుకొంటచేఁ గలిగెన యది,
వెంటనే పోవు;— ఒక్కింత బిగియఁ గట్ట
నిందు, నిముసమ్ములోపల నిమ్మళించు.

[తన జేబురుమాలును తలచుట్టుఁ గట్టఁబోవును.

అథి. వలదు, చాలదు నీ రుమాల్;—

[రుమాలు కట్టనియ్యక దశదమాన చేతుల నాఁపును. అంత నామె దానిని తన గౌను జేబులో నుంచఁదలఁచి మఱుపులో విడువఁగా నది క్రిందఁబడును.]

[అథిలుఁడు కన్నులు తెఱచి సతిని కౌఁగిటఁ గ్రుచ్చి] — బంధ మేటికి,
కదియెపోవును; రమ్ము, పోవుదము రమ్ము!

దశ. మీకు స్వస్థత లేదని మిగుల వగతు.

[అథిలుఁడును దశదమానయు నిష్క్రమింతురు. క్రిందఁబడిన రుమాలు యామిలి తీసికొనును.]

యామి. సీ॥ చేఁజిక్కెనిది, సంతసిల్లితి! దీని దే
వికి మూరుఁ డొసఁగెను బెండ్లినాఁడు;
నా బుద్ధులమగండు నన్ బలుమఱు వేఁడు
దీని నెట్లేఁ గొని తెమ్మటంచుఁ;
గాని, యెుల్లన; అమ్మ ప్రాణమ్ముతో సమా
నమ్ముగ దీని నిత్యమ్ము ప్రేమ
తోడఁ గాపాడు, మాటాడి ముద్దిడు — మూరుఁ
డిందలి యమ్మృత మెఱుఁగఁ జేసె;
తే॥ ఐన, నిప్పూలు మఱి యొకదానిపైనఁ
గుట్టి యిచ్చి నా యాతని గోలఁ దీర్తు;
ఏమి సేయునో, యీశ్వరుండే యెఱుంగు,
అతని భయమొండె నామది కనుభవమ్ము.

---

## తృతీయ సంధి *

—:o:—

ప్రవేశము :—సూత్రధారుఁడు.

ద్వి॥ ఘనులార! నదుమాత్రగాఁ డితండేటి
కని నన్ను దూఱుట న్యాయమ్ము కాదు;
తెరల మధ్యను మీకుఁ దెలియక నడచు
తెఱఁగెఱింగింప నే తెంచెదఁ గాని,

* నాటక ప్రదర్శనమున దీనిని వదలి వేయవచ్చును.

కనులారఁ గనఁగల కతలు వచింపఁ
గను రానుజుఁడి; మీరు కన్నారలిపు, డ
యాగరాకాసి యయ్యఖిలనాయకుని
భోగపదవినుండి బోర్లంగఁద్రోసి
అనుమాన సాగరమందుఁ దేలుచుట.
గొనకొని యందుల గుట్టుమట్టులను
విచ్చి చెప్పిన నొక పెద్ద గ్రంథమగు ;
ఇచ్చట వలనుకా; దెంతెంత మీఁదు
బుద్ధికి విశద, మామూలము దాని
హద్దు కన్గొని తృప్తి నందఁగఁ దగును ;
బాపురే! ఆ చాటుఁబల్కులు, భయము,
లాఁపులు, నూఁపులు, నఱపాల తెల్పు
టక్కులు, జాలిమాటలు, ప్రక్క వేటు,—
లక్కజమే, యివి యఱగడెలోన
నిక్కపటమనస్కు నిర్మలాత్మకుని
నిష్కారణమ్ము సందియమున ముంచి
జనకునిశాపము జ్ఞప్తికిఁ దెచ్చె!
కన నోఁచితిమి, కడుంగడు వింత యలరఁ
దనదేవిఁ గాంచినంత నతండు నరక
ముననుండి విడి స్వర్గమును బట్టు, టహాహా!

ఎంతకాలము నిల్చు నీక్షింపవలయు.
అంత నా వింమున కరిగె నతండు
సందియముఁ దొలఁగి సంతస మూని;
అందఱు నానంద మందిరి కాంచి;
వెనిసు రాజునకును బ్రెగ్గడలకును,
ఘనునకు మంతనాఖ్యవర యోధునకు,
అఖిలనాథునకు, భార్యామణి, కపుడు
మధుర వాక్యముల క్రమమ్ము మీఱంగ
దీవనలు సెలంగెఁ; దెలిపెను మిత్ర
భావమే కాస్యునిపట్లఁ దాఁ దాల్చు
ననియును, గొల్వున నాతని మఱల
నునుచు టొప్పున యనియును మంతనుండు;
దశదమాన కెలర్పు తనరినయట్లు
విశదమయ్యె ముఖమ్ము వీక్షించునంత.
అంకురించెను మది ననుమాన మప్పు,
డింకెట్టు లఖిలుఁ డయ్యెడ నిల్వఁ గలఁడు?
దేవి నెల్లరును స్తుతింపఁగ వినుచు
ఏ విధమున సహియింపఁ గలండు?
అక్కటా! యనుమాన మాత్మలో మొలచి
యెక్కడి మాటది యేపారకుంట?

రుధిర ముష్టముగొని త్రుళ్లుచుఁ బఱవ,
అర్థిలుని తల గిఱ్ఱుమని సంభ్రమించె;
విందారగింపైన వెన్వెంటనే పి
ఱింది వేడుకలకుఁ బ్రేయసి నిల్పి
యరిగెను దనయఱకతఁడు విశ్రాంతి
కొఱకని; యచ్చటఁ గొంత ప్రొద్దురలు
చుట్టూఁత లూఁగుచు యోజనల్ సలిపి
వెఱ్ఱిభంగిని మనోవేదనఁగాంచె;
ఎట్టకేలకు నాతఁడీ సంశయమ్ము
వట్టి దుర్భ్రమయె దుస్స్వప్న మే యనుచు
నిర్ణయించె; అయాగునిం బిల్చి, తాలు
జీర్ణింపఁ జేసెడి చీవాట్లమందు
తినిపింపఁదలఁచె, సందియము లూహించి
తన కెఱింగించిన తప్పిదమ్మునకు;
దృష్టాంత మేమియుఁ దెలుపక యిట్టి
దుష్టవాక్కుల నేల తోఁచినయట్లు
పలుకంగఁ గడఁగె, లెంపలు వేతు ననుచు
అలుకతో రగుల్చుచు నాతండు సెలఁగె.

*        *        *

కం॥ ఇదమిద్ధమ్మని మదికిఁ
గుదిరిన మాత్రమున నెట్లు నుదుటంగల వ్రా
లు దొలఁగు? అకట విధియుఁ
దదేకనిష్ఠగను మూరు నాశమవన్నేఁ.

కం॥ చెవిలోన విసము పోసెను,
రవులం జేసెను హృదంతరాళము, నపుడే
దవిలించె విందు, నందుఁ
రవిలించెఁ హృదయమెల్ల నరకజ్వాలఁ.

కం॥ ఈ వెతయుం జల్లారుట
యేవితమున నేనిఁ బొసఁగునే? పొసఁగిన నెం
తో వేళ నిల్వఁగూడునె?
ఆ విధి తనబంటుచేత నాయుధ మిడఁడే?

ఉ॥ చావడిలోన యామిలియుఁ జాటున నొక్క రు
మాలుపైన నా * దేవి రుమాలు పూలగతిఁ దీ
ర్చుచుఁ గుట్టుచు నుండువేళ, న * య్యో! విభుఁ
డేఁగుదెంచు; నలయు గ్గలి భీతిలి యారుమాళు
లఁ * బావడ జేబులోఁ జొనుపు; భర్త కనుం
గొన మోసమాఁగదా! * యేవిధి, కాంచుఁ డీ!—
అఖిలుఁడే పిలిపించె నయాగు, నక్కటా!

## రంగము ౪ — ముందటి వసారా.

———:o:———

ప్రవేశము :—యామిలి (కుట్టుచు).

[అయాగుని రాకచప్పుడు విని రుమాళ్లను గౌను జేబులో దాఁచును. అయాగుఁడు ప్రవేశించును.]

---

అయా. తే॥ ఏమి! యొంటిగ నిచ్చట నేమిసేయు
చున్నదానవు, యామిలి?

యామి. ఊరక నను
దూరకు, మయాగ! ఒక్క వస్తువు లభించు
నావలన నీకు.

అయా. నీవలన లభియించు
నాకు నొకవస్తు!—వది నవీనమ్ముకాదు.

యామి. హా!

అయా. వివేకములేని యిల్లాలు.

యామి. అయారె!
అంతియేకద, చింత లే; దా రుమాలు
నియ్యఁగల్గిన బదులేమి యియ్యఁగలవు?

అయా. ఏ రుమాలు?

యామి. ఏ రుమా లననేల? ముందు
మూరు దేవి కొసంగిన యా రుమాలె;

ప్రుచ్చిలింపఁగ మఱిమఱి హెచ్చరించి
నీవు నకౌ బతిమాలు కొంటివె అదేరు
మాలు.

అయా.　　ప్రుచ్చిలి నావా ?

యామి.　　ప్రమాద మెసఁగి
యిచట నది పడు టెఱుఁగక యేఁగె దేవి;
యేను గని తీసి దాఁచితి, నిదిగొఁ జూడు!

అయా. మంచి కొమ్మ! యిమ్మా, బతిమాలుకొందు.

యామి. దీని నెల్లని దొంగిలి తెమ్మటంచు
నన్ను వేమఱు బతిమాలినాఁడ వేల ?
ఏమిపని దీనితో నీకు ?

అయా. [రుమాలు లాగుకొనుచు] — అదేల నీకు ?

యామి. హెచ్చుకార్యము దానితో నెసఁగకున్న,
మఱల నాకియ్యవలయుఁ జుమ్మా, అయాగ !
దానిఁ గనకున్న, మాదేవి యానిముసమె
పిచ్చిదై సను.

అయా.　　దీని మాటచ్చుకొనకు;
ఇది యొకందునకొదవు — నీ వింకఁ బొమ్ము.

[యామిలి నిష్క్రమించును.

ఈ రుమాలును గాస్యోని యిక్కయందు

జాఱవిడుతు నాతనికిఁ జేకూఱు చోట ;
సంశయముగల్గ, గడ్డి పోఁచలును దొడ్డ
వేదవాక్యము లట్ల ప్రవృత్తిఁగాంచి
నిశ్చయము మదిలోన జనింపఁజేయుఁ ; —
గొంతవఱ కిది మేలొనగూర్పఁగూడు ;
మూరు తలకెక్కి నా విసమ్ము కలవరము
పొదలఁ జేయఁగఁదగు నింత ప్రొద్దునకును ; —
కసటుఁదలఁపు లునురుఁగొను విసములౌను ;
వెగటుసేయవు మున్ముందు, వెనుక రక్త
మునఁ బ్రవేశముఁగాంచి యద్భుత మెసంగ
గంధకపు గనులట్ల భీకరములైన
భగభగజ్వాలలను గొల్పి రగులఁదొడఁగు. —
ఔర ! నేఁ బల్కిన తెఱంగె ! — అదిగొ వచ్చు ! —

ప్రవేశము :— అథిలుఁడు (కొంత దవ్వున).

అభిని, గంజాయి, బంగు, కైపమరఁజేయు
పానకమ్ముల మధువుల వర్గమెల్ల
నిన్న రాతిరి నీకబ్బియున్న నిద్ర
సౌఖ్యమును మఱి యొసఁగఁగఁ జాలియున్నె ?

అథి.— చెనఁటి యూహలఁ దెల్పి నాచిత్తమందుఁ
గళవళముఁ గల్గఁజేసె ; నిశ్చలత కుదుర

కున్నయది ; అయ్యో ! స్వర్గమ్మునుండి నార
కమ్మునకు, దాననుండి స్వర్గమ్మునకును
చాఁగురే ! యిట్టు లురియుచు నూఁగు టబ్బె !
ఔర ! యీ వాతరట్టు నిష్కారణముగఁ
దుంటపల్కుల నాహాయి మంటఁగలిపె !—

[అయాగుని డాసి]—

హా ! అహా ! నాకు !— అఖిలున — కపయశమ్ము
తవిలెనే ? .

అయా. నాథ ! యింక నా తలఁపు విడుఁడు.

అఖి. పొమ్ము, దుర్మార్గ ! నన్నిట్లు ముండ్లమీఁదఁ
బండఁబెట్టితి — వనుమాన ముండఁజేయు
పల్కులను విని కలవరం పడుట కన్న
ఎగ్గుఁ బొరసిన మేలెపో, యెఱుఁగకున్న.

అయా. ఏటి కీ గతి, నాథ, యిదేమి ?

అఖి. ఏమి !

నీ దురూహలు నా చెవినిఁ బడకున్నఁ
జాటుఁబను లాపె చేసెఁబో, సాధ్యమయ్యె
నే యెఱుంగఁగ ? నాకు నే యింద్రియమునఁ
దెలిసె నవి ? నాదు కన్నుల దృష్టిఁ గనక
తలఁపు లేదయ్యె, నేసిలుగొలయదయ్యె ;

లెస్స భుజియించి సంతోష లీలలందు
వేడ్కఁగనుచుంటి; నెమ్మది వెలసె; హాయి
నెగడి నిద్రింపఁ గల్గితి నేఁటివఱకు.
కాన్యుఁ డిడినట్టి ముద్దులు కాంత యోష్ఠ
ములను దెలిసెనె నా స్పర్శమునకుఁ, జవికి,
ఘ్రాణమున కేని? అతఁడు చూఱకొనినట్టి
ముద్దులుం దెలిసెనె?—కొల్ల పోయినతఁడు
కొల్ల మెఱుఁగకయుండి, యా కొల్లసొత్తు
కొల్లగానున్నపుడు, కొల్ల గొననియట్ల.

అయా. ఈ తెఱఁగుఁబల్కులకుఁ జింత యొసఁగె నాకు.

అధి. దండులోఁ గలవార లందఱును—అధికు
లథములునుగూడ — ఆపె దేహమ్మునంటి
హాయిఁగని యుండ నేమి, యే నది యెఱుంగ
కుండినన్ నాకు సౌఖ్యమ యొప్పు;—ఇపుడో?
అయ్యయో! యిఁక వీడ్కోల యన్నిటికిని——
అకట! నిశ్చింతకును నెమ్మదికి సలాము!
నెమ్మికి సలాము! విజయ చిహ్నమ్ములొప్పు
సేనకు సలాము! యోధ కాంక్షించు మేటి
యుద్ధములకు సలా, మయయో సలాము!
అడుగు ద్రొక్కుచు హేషించు నశ్వమునకు,

తూర్యమున, కుత్సవముచాటు దుందుభికిని,
ప్రేరణముగొల్పు భేరికి, వీరనాద
మెసఁగఁజేయు బాఁకాకు, నిదే సలాము!
నవ్యమా వేణునాదమ్మునకు సలాము!
జయము ప్రకటించు రాజధ్వజమ్ము, యుద్ధ
దర్ప, మాహ్లాదము, ఘనప్రతాపభాతి,
నికరమా ఖ్యాతి, యీ యన్నిటికి సలాము!
ప్రళయకాలంపు మేఘగర్జనపు సృష్టి
కాదిసాధనమా కంఠనాద ముఖము
మృత్యుయంత్రమ్ములార, మీకిదె సలాము!—
అఖిలు జీవితవృత్తి యిం కంతరించె!

అయా. నాథ! యీగతి మీరు —

అఖి. [అయాగుని గొంతు పట్టికొని] — తుంట! పలుగాకి!
ప్రల్లదపుబండ! నా ప్రియురాలు లంజె
కా నిదర్శనమిమ్ము, నిక్కమని చూచి
కొమ్ము, నా కనులకు రుజువిమ్ము; కాక,
నిత్యమా నా త్మసాక్షిగ నిజము — నాదు
ప్రజ్వలిత కోపధాటినిఁ బడుటకన్న
శ్వానమై పుట్టియుంటివ యేని మేలు.

అయా. ఇంతకమ్యె నొ,అయ్యయో! యిదియొ ఫలము?

అధి. నాకుఁ జూపించుమా ; అటుగాక యున్న
సందియము లేశమేనియుఁ జెందఁ గల్గు
ముడియు ముడుతయు లేని మైవడిని నీదు
పల్కులను దృఢపఱుచుమా ; పరియుదేనిఁ
బ్రాణములమీఁది యాసఁదొలంగు.

అయా. నాథ!—

అధి. కాని పల్కులు పల్కి నిష్కారణముగ
నాపె నిందించి నన్ను సంతాపమందు
ముంచి హింసించెదవయేని, పొమ్ము నీకు
వగవఁ బని లేదు, ప్రార్థన వ్యర్థమగును ;
ఘోరములపైన ఘోరముల్ గూర్తువేమి,
ధారుణి వడంక మింటఁ గన్నీరు కాఱ
దుండగము లోన ర్తువయేమి, తొడరఁబోదు
హెచ్చఘము ; హెచ్చధోగతి యేది నీకు ?

అయా. మ॥ కరుణాసాగర ! యీశ్వరా ! ననుఁ గృపం
గావంగదే ! ఈతఁడుఁ * నరుఁడే? — ఆత్మయుఁ
గద్దె నీకు? మతియుం గద్దే? సుఖమ్ముండు, మ *ప్ప
రమాత్ముండె సహాయమ్మాను ! వలదప్పా యింక
నీ కొల్వు ; ఛీ ! * కర మజ్ఞానముచే గడించితిని
దుఃఖం బిట్టు సత్యంబునన్.

కం॥ విపరీతము లకటా! యీ
ప్రపంచ మార్గములు; సత్యవాక్పరతయు నె
గ్గు ఘౌనర్భుఁ గాదె! ఈ నీ
తి పదార్థేల్ సేయఁజాలదే తెలియంగన్ ?

తే॥ మీకు సతులొనరింతు నీ మేటి లాభ
మునకు; నీక మిత్రు నెడఁ బ్రేమమును నిలుపను;
దానఁ బగ గల్గు టొండె కదా ఫలమ్ము!

[అని శటాలునఁ దిరిగి పోవుచున్నాడు.

అఖి. నిలుము; నిను సత్యవాదిగఁ దలఁపఁబోలు.

అయో. ఇంక, నేను వివేకినై యొసఁగఁబోలు;
సత్యవాదివివేక మసత్యమగుటఁ,
గార్యభంగమ్ము యతనికిఁ గల్గు ఫలము.

అఖి. సీ॥ అకట! నాసతి సాధ్వి యౌనని కాదని
యొక నిముసమునంద యూహఁగందు;
నీవు యోగ్యుఁడవని కావని యిటునటు
నొక నిముసమునంద యూహఁగందు,
చంద్రబింబము పోల్కి స్వచ్ఛమౌ నాయశ
మ్మును దాఁకె నల్పు నా ముఖమునట్ల;
సైఁపఁగాఁ జాలన యీపరాభవము నా
కాపయి నే శిక్ష లడరనున్న;

తే॥ పాశములు నారసమ్ములు బల్లెములును
శూలములు ఖడ్గములు వహ్నికీల లుడుకు
గాడ్పులు విసంపుభోనముల్ కలవటంచు
జంకుసెందుదునే? — నిదర్శనము వలయు.

అయా. తే॥ నాథ! మీరలు కోపమునస న్నునింగి
యున్నవారు; మీకిది తెల్పియుంటి ననుచు
వగచువాఁడ; — దృష్టాంతము వలతురయ్య?

అథి. వలతునా! — వెంటనే కనుపఱుపవలయు.

అయా. కనుపఱుప వచ్చు; — కాని, యెక్కరణి సయ్య?
నాథ! కనులార మీరు కనన్ వలతురె
ఆపెతోసల్పు నతని యనంగలీల?

అథి. అయ్యొ! ఘోరమ! నరకమ!

అయా. అయ్య! అట్టి
పట్టునన్ వారు కన్పట్టు టెట్లు లబ్బు?
పరమపాపిష్ఠులుగ వారిఁ బల్కవలదె
వారి కనులకుఁదక్క నిం కేరికేని
వారి పోకిళ్లు తెలియంగఁబడిన? — కాన,
ఏమిగతి? ఎట్లు లింక? ఏ నేమిపల్కఁ
గలను? ఎవ్విధమునఁ దృప్తి వెలయు మీకు?
అయ్య! కనుటయు సాధ్యమౌనయ్య! — వారు

చింబులట్లు మదించిన చియ్యానున్న,
కొండ్రముచ్చులభంగి బల్ క్రొవ్వియున్న,
అడవికుక్కలయాసత్తి నడరుచున్న,
త్రాగుఁబోతులమేయి స్మృతి తప్పియున్న,
కనులఁగాంచుట పొసఁగద; — కాని, యూహా
ధ్రువ పఱిచి నిశ్చయము మదిఁ దోఁపఁజేయు
నంశములు తెలియంగూడునయ్య, నాథ!

అఖ. ఒకటి తెల్పుము సందియము కలియనిది.

అయా. సీ॥ అయ్య! యీ దొడ్డకార్యమ్ము నే నొల్లన;
అయిన సత్యమ్ము ప్రేమయును నన్నుఁ
గొనిసనె నింత దవ్వున కిందుఁ; గావున,
నింక నేఁ బల్కుటయే విధియగు;
మొన్న మొన్నసె కాస్యుఁడు న్నేను శయనించి
తిమి యొక్కచోట, నా సమయమందుఁ
బంటినొవ్వున నిద్రఁ బాసియుండఁగ వినఁ
గల్గితి నాతని కలవరములు;
తే॥ కనుటయుం గల్గెఁబో క్రొఱగాని పనులు —
విరళముగఁ దెల్ప మది లజ్జ బొరయునయ్య;
కలరుగద స్వప్నములుగాంచి కాస్యువట్లు
పలవరింతలచే గుట్టు తెలుపువారు?

ఉ॥ మామిడిపండ! నా దళదమాన! హుసారు సు
మా! మనమ్మునం * దే మన ప్రేమ లొప్పఁదగు;
నించుక యే వెలిఁబొక్క రాదు; వ * హ్వా! మఱి
యెన్ని నాళులకో, హా! — యని యక్కునఁజేర్చి
నొక్కి, నన్ * వేమఱు ముద్దులాడె; — రమణీ
మణి! నిన్నుఁ గిరాతుపాలు కా * నేమిటి కిట్లు
బ్రహ్మ లిఖియించెఁగటా! యనె నాతఁడ త్తఱిన్

అధి. తే॥ ఎంత ఘోరము! ఘోరము!

అయా. ఇదెల్ల స్వప్న

మయ్య, నాయక!

అధి. కానేమి, యందు సంది

యమున కాధార మొప్పుచు నైపు కాంచు.

అయా. తక్కునాధారముల కది దార్ఢ్య మొసఁగు.

అధి. ఛీ! యిఁకను నాపె నారగఁ జేల్తుఁగాక.

అయా. ఆత్ర మొప్పదు, నాథ! యీ నేత్రములకు
నేమి కనపట్టె? దుర్గుణ మింతలోనె
యూహసేయఁగఁ జెల్లునె? ఒకటి తెల్పుఁ
డయ్య, మీ సతిచేనుండె నయ్య, వింత
వింతపూల రుమాలు —

అధి. అది పెండ్లినాఁడు

నే నొసంగినదే, యేమి దానిమాట ?

అయా. అది యెఱుంగను ; గాని, నేఁ డా రుమాలు —

మీసతి రుమాల యౌట కేమియును సంది

యమ్ములే — దది యీ యుదయమునఁ గాస్స్యొ

చేత నుండె ; నతఁడు తుడిచికొనెనయ్యొ

తనదు గడ్డము మీసము దానితోడ.

అథి. — [పండ్లు కొఱుకుచు] —

ఆ రుమాలె నా యొసఁగినదైన, నింక —

అయా. అదియొ మఱియొండో, ఆ రుమాలా పెదాను;

తక్కు దృష్టాంతములఁ గూడి తప్పఁ దెల్పు.

అథి. ఉ॥ అక్కట ! యల్ల దాసికి సహస్రము ప్రాణము

లొప్పెనేని నా * యక్కసు తీఱు ! ఒందు కడు

నల్పము, హీనము ; దోస మంతయుం * జక్కఁగఁ

దెల్లమయ్యె; నీఁక సైఁప; నిదే కనుమీ, అయా

గ ! నా * మక్కువ ప్రేమయెల్ల ననుమానముఁ

గాంచక యిట్లు — [చేతనున్న కాగితమువ్రక్క పైకూదుచు] —

ఆకస * మెక్కఁగ నూదువాఁడ ; — అది యేఁ

గెన పో ! యింక నీడ నిల్చునే ?

మ॥ ఇఁకఁ బాతాళమునుండి పెల్లగిలి పైకే తెంచుమా,

కాలరూ * పక విద్వేషమా ! — నీ కిరీటమును

హృద్భాగస్థమా నీదు పీ * ఠకముం బాసి కఠోర
వైరమునకుఁ దావిచ్చి యో ప్రేమమా ! * —
ప్రకృతిఁ మీఱుమ, కాలకూటవిష భారమ్మంది
యో డెందమా !

అయో. ఉ॥ శాంతము ! శాంతమయ్య !

అధి. ఇఁక శాంతము

రక్తముఁ గ్రోలి నంతనే ! *

అయో. ఈంత దురాగ్రహమ్ము

ననునే ? హృదయమ్మును మాఱఁ బోలదే ? *

అధి. ఎంతువెయట్లు ? నాకినుక కింతట ముంగలిచూ

పె, వార్ధియం * దంతముఁ జెంద ముందునకు నా

ర్భటినేఁగు మహానదింబలెన్.

[మానినీ వృత్తము] —

నమ్ము, మయూగ ! మనమ్మున నెమ్మిక నాకిఁకఁ గ

ల్గదు సుమ్ము ; మహోగ్ర * గ్రమ్మగు మద్విపు

లాగ్రహ వహ్నికి రక్తపుఁ బానక మీయక ద్వే *

షమ్ము నశింపదు, శాంతి జనింపదు; సత్యము, సత్య

ము, సత్యము ! — [మోకరించి, చేతులు మోడ్చి పైకెత్తి, ఆకసము

వంకఁ జూచుచు] — దై * వమ్ము విన న్వచియించితి నీ

నుడి ; — బాసకు భంగము రాఁ దగునే ?

అయా. [మోకరించి, చేతులు పైకెత్తి, ఆకసమువంకఁ దలయెత్తి, కనులుమూసికొని]

[మానినీ వృత్తము]—

లేవకు, నాయక, లేవకు! — నింగి వెలింగెడి గోళ
ములార! కనుం; * డీవసుధన్ నలువంకల రాజ్య
ము నేలెడి భూతములార! వినుం; * డేవముఁ గాం
చక యెగ్గుఁదలంపక యెట్టికిరాతక కార్యము నేన్
* సేవకుఁ డీతఁ డయాగుఁడు సేయఁగ సిద్ధము
నాథున కబ్బిన యీ * యావడిఁ బాపఁగ, నీ
శిరమున్ హృదయమ్ముఁ గరమ్ములు నర్పితముల్.

అఖి. చం॥ పలికితివోయి ప్రేమమున; బాగనిమెచ్చుట
పెద్దకాదు, నేఁ * దలఁచెద నిన్నె నమ్మగ; వ్య
థా నుడు లేటికి, నేన చేయఁగా * వలసిన కార్య
మున్ నెఱపఁ బంతు నినున్, విను — మూఁడునా
ళ్లలో * పల నలకాన్యుఁ డీల్గిన సువార్తను దెల్పి
ముదమ్ముఁ గొల్పుమా!

అయా. ఉ॥ చెల్లినయట్ల నాసఖుఁడు — చెల్లదె మీాపను —
పాపెనుంచఁగా * జెల్లును నాథ!

అఖి. .. నాశమును
జెందఁగఁజెల్లున యల్లలండి; పెన్ * బ్రల్లదురా
లు, లంజ, పలువన్నెల దయ్యము, దానిఁ జెచ్చె

రం* జెల్లఁగఁజేయు సాధనము సిద్ధము సేయఁగఁ
జెల్లు నింతటన్.

కం॥ రమ్మాలోనికి; నా చి
త్తమ్మున మిత్రునిఁగ నిన్నుఁ దలఁచెద నిఁక ; నీ
నెమ్మి యెఱింగితి ;—

అయా. నా ప్రా
ణమ్మ సమర్పితము మీకు ; నమ్ముము, నాథా !

[లోపలికి నిష్క్రమింతురు.]

---

## చతుర్థసంధి.*

—:o:—

ప్రవేశము:— సూత్రధారుఁడు.

వ॥ సుధీమణులారా! కంటిరి గదా, యెత్తెఱంగున అ
యోగుం డమ్మహనీయు నఖిలనాథు ననుమాన సాగ
రమ్మున ముంచి మఱిమఱి పోర్లించి శ్వాసబంధనమ్ము
కావించె. అద్దిరా! యీ సుద్దులు నుడువువేళ నా
రుమా లద్దురాత్ము నొద్దన యుండె! నాల్గు గడెలకు
మున్ను దశదమాన దానిం దనతలకుఁ గట్టంబూనె
నని యథిలుండు పలుకం జాలఁడయ్యె — అత్తఱి నా
తండు కనులు మూసికొనియుంట నీ రుమాల యని

* నాటక ప్రదర్శనమున దీనిని వదలి వేయవచ్చును.

యెల్లెఱుంగు? — నయ్యారే! దయ్యమ్మున కియ్యా
దియు సాహాయ్యమ్ముగ నేర్పడియె, నింకేమివిధి యీ
క్షింతురుగాక.

అంతనయ్యథిలుండు నయాగుండును లోనికిఁజని
యేకాంతమ్ముగ సల్పిన మంతనమెయ్యది? కాస్యునిం
గడతేర్ప నయాగునకు నియోగించి, దశదమానం
దానే పరిమార్ప నిశ్చయించికొనెం గదా, అటుపై
నథిలుం డేమిసేయ నుద్దేశించినవాఁడు? ఇక్కార్య
మ్ముల కారణమ్ములు తేనికెఱింగించి, యెప్పటియట్లు
లాతండుజీవించియుండఁ దలంచెనే? లేదులేదు. అను
మాన పిశాచ మావహించిన కతనఁ దన సెమ్మదియు
నెమ్మియుం జెడెనని విలపించి యన్నిటికి నొక్క చో
ప్పున వీడ్కోలుసెప్పిన యాతం డెప్పగిది నిప్పుడు
మనియుంట కొప్పికొనంగలఁడు? అయాగుని కరమ్ముఁ
దనకరమ్మునఁగీలించి యాధీరుండుకన్నీరుజొటజొటఁ
గార్చుచు—అపరాధులవధకు విధాయకమ్మేర్పడియె,
నింక నా యవివేకమ్మునకు మరణమ్మె తగిన దండన
మ్ము కదా!—యన్ని పలికి, తన నిర్ణయ మెఱింగించి—
అయాగా! యువనాయకా! నీవ నాస్థానమ్మున నాయ
కుండవై యిప్పురమ్మును భద్రమ్ముగ రక్షణమ్ము సేయ

వలయు ; ఈ నాచేయ్దమ్ముల తెఱంగెల్ల రకుఁ దెల్లము
గఁ దెల్పి నాకు నిందఁ బాపవలయుఁ జుమీ !— యని
జాలిపలుకుల డెందమ్ము నీరగు చందమ్మునం బలికె.
అప్పలుకుల కయాగుండు కలగుండువడి నిశ్చేష్టితుం
డై, యొక్కింత తడవునకుఁ దెప్పిఱిలి, శిరమ్ము వాంచి
—నాథా ! మీరు సనుటకుమున్ను నాయవివేకమ్ము
నకు నన్ను మీర చేసేతం జెల్లింపవలయు—ననుచుఁ
గడుంగడు దీనభావమ్ముతోడ వేఁడికొనియెం గాని,
యతిలుండు తద్దయు ధైర్యమ్ముసెప్పి, హితబోధమ్ము
సేసి, యెట్టకేల కాతని సమాధానపఱిచి పుచ్చె.

అంత, నయాగుండు చింతాక్రాంతుండై యతి
లుని వీడ్కొని, మనమ్మున నువ్విళ్లూరుచుఁ గాస్యుని
యిక్కకుంజనియె. తనచేఁ జిక్కియున్న దేవిరుమా
లక్కడ నెక్కయివడినేఁ జాటుగఁ బడవేయవలయుఁ
గదా, అతనియదృష్టము కనుఁడు, కాస్యుఁడు గుఱు
వెట్టి నిదురవోవుచుండె—ఉదయమున దశదమాన
తెలిపిన దయగల పలుకుల కాతని యుల్లంబునఁ గల
యులుకెల్లఁ దొలఁగంబాఱి షాయిగనిదురయబ్బుట
యబ్బురమా ? గవాక్షద్వారమ్మున నయాగుఁ డా
రుమాలు లోపలం బడవైచి తన మనికి పట్టున కరిగి

పరుండి, స్థితి గతులఁ జక్క నెంచి, తనకు రాఁగల మహా
దశం దలంచి యొక్కింత తడ వుబ్బి తబ్బిబ్బులయ్యెం
గాని, వెనువెంటనె యాతం డది గాలిపంట నమ్మరాని
దని యెఱింగి, జాగున నోగగునని వెఱచి, తత్క్షణము
కాన్యునిగడముట్టించు వెర వారయుచుండె. ఆ రేయి
నతనిం దన వేడుక వెలందియింటికిఁ బొమ్మని పురికొల్పి
పుచ్చి, యటనుండి యతండు తిరిగి వచ్చువేళఁ—
జీఁకటిలో — రుద్రగుఁడు — సరిసరి! దయ్యము
తల పెట్టినచోఁ దంత్రముల కేమి కొఱంత?

అచ్చట నఖిలుం డే తీరున నున్నవాఁడు, కనుండు!
అయాగు ననిపి యాతం డొక్కింత విశ్రాంతిఁ గోరి పా
న్పు పయిం బవళింప, నయ్యరే! అది యేటి మధుర
గానము! అహాహా! విందులవీనులకు దశదమాన
విందొనర్చుచున్న యది. ఆ దేవి దేవతారూపం బఖి
లుని యాత్త కానందంబు గొల్పి పందియంబు నడ
ల్చెడిని! బాపురే! యా పుణ్యవతి నా పోరిపుచ్చుట!
కట్టా! ఎట్టి బెట్టిదంపుఁ దలంపు! ఎంతటి ఘోర, మెం
తటి పాపము! ఆ పె గుణమ్మున దోష మెన్నుట యెట్టి
దురూహా! * * * అక్కటకటా!
అయాగుని కోపపుఁ బల్కులుం గొలువుపిడ్కోలు
[illegible]

నఖిలుని కర్ణమ్ములఁ బ్రతిధ్వనిఁగావించెడిని. అయ్య
యో! ఆతని యుల్లమ్ము సొమ్మసిల్లి కూలంబడియెడి!
ఛీ! వగలాడి మగువల మ్రోల మగవారి బిగువులు
బింకెములు నిలుచు టెక్కడి మాట! ఛీ ఛీ! పాపిష్ఠి
పిశాచమా! దృష్టినుండి తొలఁగుము. మోహినీ
భూతమా! పొమ్ము పొమ్ము! ప్రియమా! యింక నా
హృదయమున నిలువకు. ద్వేషమా! యుప్పొం
గుము! * * కోపానలభీకరమ్ములగు నక్షి గోళక
మ్ముల విస్ఫులింగమ్ములు వెలువడి నలుదెసలం బర్వ,
అఖిలసింహాంబు ప్రచారంబు సల్పుచున్న యది! ఓ
హో! యీక్షణము తనమెరపైఁ దటాలున వ్రాలి
దానిం జీల్కలుగ జీల్చుంగాక! తానిచ్చిన యాపూల
రుమాలు నిచ్చివేసె!—తానెంతో వింతయని తెల్పిన
రుమాలు! తెమ్ము, దానిం దెచ్చి చూపుము! ఈ
నిముసమ! — కాకున్నఁ, బ్రాణమ్ము లిమ్ము * *
శాంతము! శాంతము! మిత్రుని కళత్రము నంటిన
ద్రోహి!— ఆరుమాలు బహుమానముగఁగొని దాని
తోఁ గడ్డముఁ దుడిచికొన్న తుచ్ఛుఁడు! — ముమ్ముం
దాతండు డిందవలయు! కాస్యుఁడు కడముట్టిన మఱు
నిముసమ యీ కసుమాలపు లండీయు వెంబడించుం

గాఫుత ! అంత దనుకను శాంతముఁ బూనవలయు.
*    *    * సంతాప కోపాటోపమ్మున నలంగి
కలంగి యఖిలుండు మరల శయ్యం జేరి, నిదురందవిలి
స్వప్నావస్థయందు మునింగె. వహ్వారే ! ఆ గానా
మృతము ! కోకిలమా ! నీ యెలుంగున నెలుంగును
మచ్చికపఱిచి మైత్రినెఱపుదు గదే ! *    *    *
రెండు గడెల తడవు నిద్రించి యఖిలుఁడు మేల్కాం
చినతఱి నాతని చిత్తమొక్కింత కుదుటంబడి శాంత
భావమ్ము గుదిరియుండె. అడవిమృగమ్ము మనుష్య
వర్గమ్మునం జేరె ! ఆ రుమాలువిషయ మాతని మన
మ్మును బీడించుచునే యున్నయది, ఆపెను నెమ్మదిగ
నడిగి తెలిసికొనవలయు. విందు ముగిసి, యతిథులం
దఱు సనియుందురు గదా, యింక దశదమానంగని
ప్రియవచనమ్ముల భాషించి నిజ మెఱుఁగంవగు. —

విందువేడ్కలు కడతేఱునంత, దశదమానయు
నతిథుల వీడ్కొల్పి కాంతుని చెంతకుఁజని యాతఁడు
నిదురం దవిలియుంట యెఱింగి, బిఱబిఱఁ దనయాఱ
కరిగి రుమాలునకై వెదకఁదొడంగె. విందునకుముం
దయ్యది తన జేబునం దుంటయు, నాథుని తలకుంగట్ట
దానిని వెలికిఁదీసి మఱల జేబులో నునుచుటయు నిశ్చ

యమే. కాని, తొందరలో నెందో పెట్టి మఱవఁబోలు
నని యాదేవి తన పేటికలం దెఱచి తెఱచి చూచియు,
గదియందుఁ జావడియందుఁ గూటమునం దెల్లెడల
వెదకియు, నెందుంగానక, యది యెందుఁబోవు దాని
నెవ్వారు గొందురని యెంచి, యించుక నిదానించి
యన్వేషించినఁ జిక్కునయని మనమ్మున నమ్మియుండె.
అంత, నచ్చటి పంచాదిలోఁ దమ సేవకునిం గాంచి
కాస్స్యునిఁ బిలిచికొనిరాఁ బంచి, ఆయమ యామిలి
తోఁ దనరుమాలుఁగుఱించి మాటాడుతఱి నఖిలనా
థుం జేతెంచువాఁడు కనుండు! దంపతుల భాషణ
మ్ములు వినుండు! పదంపడి కాస్స్యుఁ డయాగునిఁగూడి
వచ్చువాఁడు చూడుండు. ఇంక నయ్యలారా! నాకు
వీడ్కోలు దయసేయుండు! [నిష్క్రమించును.]

---

రంగము ౫. — ముందటి వసారా.

—:o:—

ప్రవేశము :— దళదమాన, యామిలి, సేవకుఁడు.

దళ. ఓయీ! యువసేనాని కాస్స్యుని వాసస్థానము తెలియునా?

సేవ. 'వాసస్థానము' తెలిసిన, ఈ మోసము లుంచు దునా?

దశ. అతని ఉనికిపట్టోయి.

సేవ. 'ఉనికిపట్టు' తెలిసిన, గడ్డము గొఱిగించుకొందుఁ గదా ?

దశ. అతని ఠికాణా — అతఁడు విడిసిన తావు.

సేవ. 'ఠికాణా' మాపుట్టినిల్లే. 'ఠికాణా' తెలియకున్న, ఈ తివాసి తీసివేసి జుట్టె పెట్టుకొందును.

దశ. ఈ ప్రసంగముల కేమిగాని, కాన్ప్యుని ఠికాణాకుఁ బోయి —— .

సేవ. అది నే నెఱిఁగినఁ గదా !

దశ. ఎఱుఁగుదు నంటివే ?

సేవ. ఎఱుఁగుట కేమి నూఱు ఠికాణా లెఱుంగుదును. అందుఁ గాన్ప్యుని దేదో ? — నేనేమి శతావధాని నని బిరుదుఁగొంటినా ?

దశ. కాన్ప్యుఁ డెచ్చటనుండునో కనుఁగొనఁ జాలవా?

సేవ. అమ్మా ! య్యాప్రపంచమున నా కగపడు వారినం దఱినిం గాన్ప్యునిఁగుఱిచి ప్రశ్నించి మీకుం దెలుపుదు.

దశ. అతనిఁ గనిపట్టఁగలవేని, ఇచటికి రమ్మనిచెప్పుము. నాథునితోడ మాటాడి యున్న దాన, శుభముగు నని తెలుపుము.

సేవ. ఈ కార్యము మనుష్యమాత్రుల శక్తి సామర్థ్యములకు సాధ్యమేయగును. కావున, నేను బూనుకొనవచ్చును. [నిష్క్రమించును.

దశ. తే॥ యామిలీ! ఆరుమాల్ చిక్కదయ్యె. ఎచట నెట్లుపోయెను?

యామి. అమ్మ! నే నెఱుఁగనమ్మ.

దశ. వేయిమొహారీలమూటఁ గోల్పోయియున్న
ఆరుమాలునకట్లు వెతారొ మంద;
నా యదృష్టముచేఁ బ్రాణనాథు గుణము
దొడ్డదాట నే దొసఁగును దొడరఁబోదు;
కాని, యరగలిసెందు మగండవైన
దీన రాఁగూడు చేడిదిఁ దెలియవశమె?

యామి. అరగలినిగాంచు గొనము నాయకుడు కనఁడొ?

దశ. అతఁడు జనియించినపుడె యయ్యల్పగుణావుఁ
గసటు రక్తమ్మునుండి భాస్కరుఁడు పీల్చివైచె.

యామి. అల్లదె, యరుదెంచు వాఁడు, చూడు!

దశ. కొలువునందిటఁ గాస్యుని నిలుపువఱకు
విడువఁజాలను.— నాథ! మీయొడలు చక్కస్వస్థమే?

[ప్రవేశము :— అథిలుఁడు. [దశదమూన ప్రక్కను గూర్చుండును.]

అథి. స్వస్థమే ; — ప్రియసఖిరో ! నీకు
సౌఖ్యమే ? — [తనలో] అబ్బ ! యెంత కష్టము న
టనము !

దశ. సౌఖ్యమే, ప్రాణనాథ !

అథి. [తన హస్తము చాఁచి] — హస్తమిటు లిమ్ము ;

[దశదమూన హస్తమును బట్టికొని]

ప్రియసఖి ! యిది మృదులమై వెచ్చనొసఁగు.

దశ. నాథ ! యది ముదిమియు వ్యసనము నెఱుఁగదు.

అథి. [దశదమూన యఱచేతిలోని రేఖలు పరీక్షించుచు] —
మార్దవము వెచ్చనయు, నివి మంచివౌను —
వితరణము భోగకాంక్షయు విదిత మిందు ;
చెలియ ! యీ చేతికిం గొంత చెఱయుఁ, గట్టు,
దండన, ముపాసములు, మేల్ వ్రతాలు, విధులు,
బూజలును, బ్రార్థనమ్ములు ముఖ్యములగు ;
ఇదిగోఁ జూడుమ ! యీ రేఖ యీడుఁగోరు
పాయపుఁబిసాసి, కండకావరముఁ బెంచు ; —
మంచిహస్తమ, త్యాగము మించియొప్పు !

దశ. అటులఁ బల్కంగఁజెల్లు ; ఆ హస్తమె కద
నాదు హృదయమ్ము నిచ్చియున్న యది, నాథ ?

అథి. హృదయములు తొంటికాలమం దిచ్చుచుండె
హస్తముల ; నది తలక్రిందులయ్యె, నిపుడు
కాలుద్రొక్కులఁ గేల్పట్టుకాలమందు
హస్తములె కర్తలౌ, హృదయములు కావు ;
ఇచ్చివేయవె హస్తముల్ హృదయములను ?

దశ. శక్తి చాలదు నాకీ ప్రసంగమునకు ;
ఇంక మీ యయ్యకోలు మాటేమి, నాథ ?

అథి. ఏమి యీకోలు, చిన్నారి?— [కనులం దశ్రువులుగారుచుండు.

దశ. ఇపుడె కాన్కఁ
జీరఁబంచితి మిమ్ము దర్శించుకొఱకు.

అథి. కనులు దురదలుగొని నీరుగ్రమ్మసాఁగె.
ఇంచు కిట్టిమ్ము నీరుమాల్.

దశ. ఇదిగొ, నాథ.

అథి. ఏను నీకిచ్చినది —

దశ. అది యిచట లేదు.

అథి. లేద !

దశ. ఔఁ, ప్రాణవల్లభా! లేద యిచట.

అథి. మ॥ అది తప్పౌనుజుమా, ప్రియా ! వినుమ, యేమం
దుఁ, గిరాతాంగనో * ర్తు దయఁ దా మాయమ
కిచ్చె దానిఁ; బలుమందుల్ మంత్రముల్ నేర్చి న

* ట్టిది యాబోమెత యిట్లువల్కెనఁట—బోటీ!
నీయధీనమ్మునం * దిది యుండెఁ‌ జివిభుఁడొప్పు నీ
ప్రియుఁడవై, యేభాగ్యమో కానిచోఁ.

కం॥ పల్కెనఁట మఱియు — దీనిం
జుల్కఁగఁ బెఱలకు నొసంగఁ జూతువె నీకుఁ
హాల్కాతనము లభించి త
గుల్కొను ద్వేషమ్ము విభునకుఁ నీయెడలఁ.

తే॥ జనని మృతిచెందువేళ నొసంగె నాకు
ఆరుమాలువు ; దాని యత్యద్భుతంపు
మహిమఁదెల్పి — ఓతండ్రి! కర్మఫలితమున
సతినిఁజేకొన నీకుఁ బొసంగినపుడు
దీని నాపె కిమ్మని పల్కె ; నేను నట్ల
సేకొసంగితి ; జాగ్రత్త నెఱపి నీదు
తారకమ్ముల భంగి భద్రముగఁ గనుమ ;
దానిఁ గోల్పోవ, దాన మీఁ, జాలునట్టి
యంకిలి గణింప నేరికి నలవికాదు.

దశ. శక్యమే యట్టి శక్తి?

అథి. నిజమ్ము, నిజము!
దాని నేతను మంత్రయంత్రములు కలవు ;
సూర్యమండలమున వేయిచుట్లు గన్న

జోగిణి యొకర్తు తనజ్ఞానయోగసిద్ధి
దాని పూలల్లె, మేల్తరమైన దాని
పట్టుదంతువు లన్నియుఁ బావనములు ;
వన్నె కెలప్రాయమొప్పు జవ్వనుల హృదయ
గోళముల నవ్యరుధిరము మూలమయ్యె.
సత్యమే యిదియెల్ల ?

అధి. నిస్సంశయమ్ము !
కాన, దానిని గనుము జాగ్రత్త యొసఁగ.

దశ. ఐనచో, నాదు కనులకు దాని నేల
దైవమగపఱిచె నటంచుఁ దలఁచి వగతు.

అధి. హా ! అదేటికి ? — [భీకరదృష్టి, ఆగ్రహధ్యానము.]

దశ. [భయవిస్మయములు] — నాథ ! య ట్లులికిపడుచు
నులుకుఁ గలిగించు తీరునఁ బలుక నేల ?

అధి. పోయెనో ? కోలుపోతో ? తెల్పు, మెట నేనిఁ
బెట్టిమఱచితో ? ఇపుడు తే పీలుపడదో ? [శాంతముతో.]

దశ. మనల దైవము రక్షించి మనుచుఁగాత !

అధి. ఏమి ? — [ఆగ్రహముతో]

దశ. పోలేదయది ; పోయె నేనిఁ గీడు
నిశ్చయమొ ?

అధి. [ఆగ్రహముతోనే] — ఎట్లు ?

దశ.　　　　　　　　పో లేదు, నిజము, నాథ!

అథె.　తెమ్ము, దానిని నను జూడనిమ్ము. [శాంతముతో]

దశ.　　　　　　　　అదేల?

తేఁగలను గాని, యిప్పుడు తే; నయారె,
తెలిసె; నేఁ గాస్స్యుఁగుఱిచి ప్రార్థింపకుండఁ
బన్నితిరి దీని; అతని నిల్పంగ రాదె
మఱలఁగొల్వున; ఇంత తామసము మేలె?

అథె.　పోయి తెమ్మా రుమాలు; నాబుద్ధియందు
సందియము కల్గుచున్నది.

దశ.　　　　　　　　చాలు లెండి!

అతనికన్న వతారి మీ కమరఁబోడు.

అథె.　ఆరుమాల్! — [ఆగ్రహధ్వానముతో]

దశ.　　　　　　　　నాథ! కాస్స్యుని నేరమేమి?

అథె.　ఆరుమాల్! — [అధికాగ్రహధ్వానముతో]

దశ.　　　　　　　　నాథ! మి మ్మాదినుండి

ప్రేమమై గొల్చి మీ దయ విశ్వసించి
యుండి యెన్నెన్నొ యిక్కట్ల కోర్చినాఁడు.

అథె.　ఆరుమాల్! — [అత్యధికాగ్రహ ధ్వానముతో.]

దశ.　[భర్త చేయిపట్టుకొని] — ఇందు మీరు నిందార్హులందు.

అథె.　ఛీ! విడుము! — [అత్యాగ్రహముతో నిష్క్రమించును.

యామి. అమ్మ! అనుమానచిత్తుఁడే యమ్మ, యితఁడు!
దశ. మున్నె యుంగన యిది, అదేమో విచిత్ర
మున్న దా రుమాల్లున; అయ్యయో! యిఁకేమి
యొదవునో దానిఁ గానక యుంటఁజేసి?
యామి. వలయునే యేండ్లు మగల స్వభావమెఱుఁగ?
వార లెల్లరుఁ గుక్షు, లాహారమమ్మ
మనము; క్షుద్బాధకోలఁదిని మనల మెక్కి
కడుపునిండినఁ ద్రేన్తురుగాదె వారు?—
అదిగో వచ్చెఁ గాస్యుండు నాయతనిఁగూడి!

ప్రవేశము:—కాస్యుఁడు, అయాగుఁడు.

అయా. ఆపె కరుణింపకున్నఁ గార్యంబు సున్న;
అదిగో నీభాగ్య! మాపెను గదిసి వేఁడు.
దశ. కుశలమా, కాస్య! వార్తలు క్రొత్తలేమి?
కాస్య. వార్త లేమున్న వమ్మ, నాప్రాంత మొఱయె
చెప్పికొనువాఁడ; దేవి! మీ గొప్పకృపను
నాథుని యనుగ్రహమునందు నాటికొనుచు
మఱల జీవముఁగాంచి ప్రేమమునఁ గొల్వఁ
గోరువాఁడన; యింక జాగు తగదమ్మ;
అమ్మ! నాతప్పిదము క్షమా నర్హమేని—
తొంటి నాకొల్వుమంచి, ప్రస్తుతపువగపు,

ముందువర్తనమున చందమును గణించి
యేని, ననుక్షమియించ రాదేని — తల్లి!
అది యెఱుంగుఁడె నాకు మేలస్తు; ఇంక
నిచటియాసలు విడిచి వే ఱెచటనేని
బ్రదుకుఁదెఱవుచు వెదకి గోప్యముగ జీవ
నమ్ము సల్పుదు నాయదృష్టమ్ము విధిని.

దశ. సీ॥ సాధుస్వభావ! కాస్య! విచారమడరె నీ
మాటలు వినఁగ నా మనమునందు;
నానాథుఁ డీవేళ నానాథుఁడుగ లేఁడు
కినుకనై భేదముఁ గనెడి గుణము;
దైవము సాక్షి, యాతనితోడ నిప్పుడ
నినుఁగూర్చి హెచ్చుభాషణము సల్పి
ఆగ్రహ మొప్పింపనైయుంటి; నిది సమ
యమ్ము కాదాప్రసంగమ్ము నెత్త;

తే॥ కొంతవడి మది శాంతముఁ గొమ్ము, కాస్య!
నమ్మియుండుము, సాయమొనర్తు నాదు
శక్తికొలఁదిని; వేయేల, స్వాంత కార్య
మునకు నంత ప్రయత్నింప నని తలంచు,

అయా. తే॥ నాయకుఁడు కోపమును జెందినాఁడొ?

యామి. ఔను;

అలుక నదరుచు నిటనుండి యరిగె నిపుడ.

అయా. ఉ॥ అక్కజమయ్యె నాయకుఁడు నాగ్రహకంపి
తుఁడన్న ; వేఁడిరాల్ * గ్రక్కు ఫిరంగు లాల
మున గర్జితముల్ సెలఁగించి సేనలన్ * దుక్కుగఁ
బారఁద్రోలి తనతోడన నిల్చిన యోధు గాలిలో
* నెక్కఁగ నూఁడ్చినం జలన మించుకఁ గాంచని
మేటిధీరుఁడే * ఫక్కినిఁ గోపవిహ్వలుఁడు ?—బా
పురె ! యేమి కతమ్ము కల్గెనో !

తే॥ పోయి, నాథునిఁ గని, ప్రత్యవాయ మేమి
పొడమెనో యెఱిఁగెదఁ ; గిన్క పుట్టియున్న
నేరిదో పుట్టె మున్ను !

దశ. పొమ్మా, అయాగ !

[అయాగుఁడు నిష్క్రమించును.

వెనిసులోన యెఱింగిన వేర మొండె
ఇచట సైప్రస్సులో నుదయింపఁబోలు
కలహకారణ మొండె నీ కళవళమ్ముఁ
గలుగఁజేసెన ; ఇట్టి వేళలను గొప్ప
లందుఁ గల్గిన కోపము వ్యాప్తిఁగాంచి
అల్పములఁదాఁకు, నన్నిట నంటుఁజొచ్చు ; —
ప్రేలితీపున నెడలెల్ల వేధఁ గనదె ?

నరుల వేల్పులపోల్కి నెన్నంగరాదు,
పెండ్లినాఁడట్లు సతతము ప్రేమ నెఱపి
తరుణులను గారవింత్రని తలఁపరాదు ;
పాపినైతి గదమ్మ, నా ప్రాణనాథు
నిర్దయునిఁగాఁ దలంచుచు నింద సేయఁ
బూనితిని, గల స్థితినిఁ దప్పుగ గ్రహించి

యామి. నాథుఁ దల్లడపెట్టు కిన్కకుఁ గతమ్ము,
అమ్మ! మీరు తలంచునయట్లు రాచ
కార్యవిషయమ్ము లే యగుంగాత మమ్మ!
మిమ్ముఁగుఱిచి దురూహాయు మెరమెరయును
గాకయుండ వేలుపులకుఁ గైమొగుడ్తు.

దశ. యామిలీ! అట్టికారణ మేమి కలిగె?

యామి. కం॥ అమ్మా! మదిలో ననుమా
నమ్మునకు నెపమ్ము వలయునా? తన కదియే
సుమ్ము కతము ; చిత్రపుభూ
తమ్మది — తనుఁదానకాంచుఁ, దాఁగల్గించుఁ.

దశ. తే॥ ఆ పిసాసి యఖిలనాథు నంటకుండ
వేలుపులు మ్రంత్రుగాత!

యామి. దేవిరో, తథాస్తు!

దశ. పోయి నాథునిఁగాంచెద ; — ఓయి కాస్య!

ఇచటనే తిరుగుచునుండు; మిపుడుసమయ
మొప్పఁగలదేని నీనుద్ది చెప్పి, నీదు
కార్యము ఫలింపఁ జేయఁగఁ గడఁగుదాన.

కాన్యు. భృత్యుఁడను, దేవి! జేజేలు వేనవేలు.

[దళదమాన, యామిలియు నిష్క్రమింతురు.]

---

ప్రవేశము:— బాణక.

బాణ. సేమమా, కాన్య!

కాన్యు. ఇల్లెల గేము విడిచి
వచ్చితివి, ప్రియ! నీక్షేమవార్త యెట్లు?
రాణి! బాణక! నిఁ గనరాన యుంటి.

బాణ. నీబసకుఁ బోవుచుంటిని నినుఁ గనంగ.
మమరె! అమవస వెన్క నే డమవసలను
ఒక్కటిగఁ గంటి నీకృప యొప్పియుంట;—
ఏడురాత్రులుఁ బవళులా వీడియుండ్రు!
కాముకులు రేవగలు ప్రొద్దుగతి గణించి
కుందుచుందురు గద, యిది యందమైన
చందమనియెన్నితో, సెబాసు! చాలుఁ జాలు!
అమ్మ! లెక్కకు నాదుప్రాణమ్ము విసివె!

కాన్యు. నన్ను మన్నింపవలయు, బాణక, వయస్య!
ఇంతకాలమ్ము నేఁ బెనువంతలోనఁ

దవిలి యుంటివి; యింక మంచి తరుణ మొసఁగఁ
గొట్టివేయుదు నీ లెక్కఁ, గోపపడకు;
ప్రియ! యిదిగో దీనిఁ జూడు! మీా వింతపూల

[దళదమానా రుమాలిచ్చుచు

యనువు నొక రుమాలువుపయి నల్లియుంచు.

బాణ. అమ్మ చెల్ల! యీామెచ్చు నే కొమ్మ నీకొ
సంగెఁ, దన జ్ఞాపకముగ నుంచంగఁ గోరి?
తెలిసెఁదెలిసె, నీ రామి కిదే కతమ్ము;
ఇంత కయ్యెనె! సరిసరి, చింత లేదు.

కాస్యు. పొమ్ము! నీ పిచ్చియూహలఁ బుచ్చుమింక;
వాని నేపాడుదయ్య మొప్పారఁ జేసె
దాని వాతనె త్రోయు; మే తరుణి తనదు
గుఱుతుగా నిచ్చినది కాదు, కుందఁబోకు;
బేల, బాణక! యరగలి విడువు మిందు.

బాణ. ఐన నిది నెవ్వరిది?

కాస్యు. అది యేను నెఱుఁగ;
దీనిఁ గంటిని నా గదిలోన నిపుడ,
పూలు కడుఁ జిత్రముగ నుంట బుద్ధి పొడమె
నొక రుమాలువుపైన నల్లికఁ గొనంగ;
అల్లుమీా, సఖి, దీనికై యడుగువారు

వచ్చులోపల; ఇంకనన్ వదలిపొమ్మ.

బాణ. వదలిపోనేల, యేమి యాపద ఘటిల్లె!

కాన్యు. చాన! యిచ్చోట నేను సేనానికొఱకు
వేచియున్నాఁడ; నిప్పటి విధమునందు
నాతితోఁగూడి యతని కంటఁ బడరాదు;
దాన మేల్ కాదు, మది నల తలఁపు లేదు.

బాణ. ఏమిటికొ?

కాన్యు. బోటి! నీపయిఁ బ్రేమ లేక
కాదు సుమి!

బాణ. కాదు; కడుఁ బ్రేమ కల్గియె సుమి!
సరియె, నన్గొంతదూరము చాగ నంపఁ
గలవె? రేఁ బెందలాడ రాఁగలవె? తెలుపు.

కాన్యు. సుంత దూరము వత్తు — నిచ్చోట వేచి
యుండవలెఁ; బెందలాడ నీ యొద్దనుండు.

బాణ. ఎంతో సంతోసమయ్యె! — వీలెట్టు లట్లు.

[నిష్క్రమింతురు.]

---

తృతీయాంకము సంపూర్ణము.

---

## పంచమ సంధి. *

———:o:———

ప్రవేశము:— సూత్రధారుఁడు.

వ॥ మహనీయులారా! అనుమానపిశాచ మెట్టి పాపిష్ఠి దో పరికించితిరి గదా! ఉదయమునందు స్వర్గసౌఖ్య మందుచుండిన అఖిలనాథుచిత్త మొక్కయామము లోపల నరకమునఁ గూలంబడి యెట్లు నుడువరాని వేదనఁబడుచున్న దో కన్నారయ్యా! యీపాడు పిసాసి పట్టిన విడుచు టెక్కడిది, విడిచిన నిలుక డెక్కడిది, నిలుకడలేక వలపెక్కడిది, అది కుదురక బ్రదుకెక్కడిది? —— తే-గీ॥

విను, మయూరాగ! సందియమును గొనకమునుపు
చక్కఁజూతున; కొనినంత జాగులేక
నిర్ణయింతున యటొ యిటో; నిర్ణయమున
కవల నెక్కెం, బ్రియమొ సందియమొ విడుతు.

ఇట్లని యథిలుండు సులభముగఁ బలికెంగాని, యిప్పు డాతనిస్థితి కనుండు! సంశయమునుండి నిశ్చయము, నిశ్చయమునుండి నిర్ణయము, నిర్ణయము విడిచి నిస్సందేహము, అందుండి యానందము, అటుపై మ

* నాటక ప్రదర్శనమున దీనిని వదలివేయవచ్చును.

అల ననుమానము — అంత, నయ్యో! యెట్టి యధో గతి! చెల్లరే! యిల్లాలు శత్రువయ్యె, దయ్యము మిత్రమై విశ్వసనీయమయ్యె — నెట్టి విపరీతము! ఇంక నయాగుని వాకులు వేదవాక్యములు, అతని కన్నులధిలునివి; అతని చెవు లధిలునివి; బుద్ధిమాత్ర మధిలుని బుద్ధియే సారాంశము నిర్ణయింపవలయు. ఈ నిర్ణయ మేతీరున నెన్ని సారులు మాఱెనో చూచితిరి; యింకను జూడంగలరు. అన్నన్నా! యెంత దురాగ్రహము, యెంతటి పాప నిర్భీతి; ఎట్టి క్రూర నిర్ణయములు! అయ్యో ఆ కల్లోలము! ఆ కపటము! ఆ కుటిలవర్తనము! అకటకటా! ఎంతటి ఘనయోధున కెట్టి గతి ప్రాప్తించినది!

అధిలనాధునిఁ గన నయాగుండును దశదమానయుం జనిరిగాని, వారి కతని దర్శనము లభింపదయ్యె. అత్యంతాగ్రహమ్మున నతండు తనయింటి చెంతనుండి వెడలి, కడువేగమ్మునఁ దనయఱలోని కరిగి, తటాలునఁ దలుపులు బిగియించికొనియె. ఆరుమాలు తెచ్చి చూపుమని యెన్నిసారు లెంత కోపముతో నడిగిన, నది పోలేదు తేఁగలననుచు వక్కాణించియు నిప్పుడు తేనని పలికి కాస్యుని విషయమైన ప్రస్తావనతోఁ

దప్పించుకొనఁ జూచె — నిం కేమి సందేహ, మా దు
ష్టురాలు దాని నాతని కిచ్చి వేయుటయు మఱలఁ దీసి
కొని తనకుఁ జూప నుద్దేశించుటయు స్పష్ట మేకదా.
ఆ నిముసమ యాపె కచ్చో శిరశ్ఛేదముఁ గావించు
తలంపునఁ గరమ్ము ఖడ్గమ్ము నంటం బోయెఁగాని, ఆ
స్వామిద్రోహిఁ గాస్యనిం గడ తేర్చు కార్యమ్మునకు
భంగమ్ము పొసంగునని తోఁచి తాను జవాలున లేచి
యఱలో ప్రాలుట మేలయ్యె; నింకఁ జిత్తమ్ము నుత్త
లంపాటణంచి స్వాధీనమ్ము గావించికొని శాంతము
వహించు టొప్పుఁ గదా! * * ఈ ప్రయత్నమున
నాతండు రెండు గడియలప్రొద్దు పల్కరాని సంక్షో
భమ్మునం దగుల్కొనియె — నబ్బబ్బా! యెన్నెన్ని
యవస్థలు! అనుమానము — ఆగ్రహము — నిదాన
ము — ఆలోచనము — శాంతము—అయ్యో యెన్నె
న్ని యుఱ్ఱూఁతలు! ఎంత ఆయాస మెంత అలసట,
ఎట్టి మతిభ్రమణము! ఇంచుకే నాలోచింప శక్తిలేని
యట్లుండె. ఆలోచించిన మూర్ఛ వాటిల్లునట్లుం
దోఁచె. అయిన, నత్యధిక ప్రయత్నమ్మున నతండు తన
బుద్ధిబలమెల్ల నుపయోగించి మఱిమఱి యోజనమ్ము
సల్పి యెట్టకేలకు శాంతభావమ్మునం గుదురుకొనియె.

* * తన రుమాలు కాస్స్యొని యొద్దనుండుట నిస్సంశయము — అయాగుండు కనియె, నతనిమాట అసత్యమెట్లగును? — అయిన, దశదమాన దానిం బోఁగొట్టుకొన్ని, వెదకిన దొరకుననినమ్మియుండనోపు; అది యెట్లోఁ గాస్స్యొనిచేఁ జిక్కియుండనోపు; ఆపె యాతని కిచ్చినట్లు నిదర్శనమేమున్నది? అయ్యో! దానింగూర్చి యాపెను స్పష్టముగఁ బ్రశ్న సేయక, సాముద్రిక పరీక్షానటనముచే నిజమెఱుంగఁ బ్రయత్నించుటయు, రుమాలువుమహిమలఁ దెల్పి యాపె నడలఁగొట్టుటయు నెంతటియవివేకము! ఆపె దానిం గాస్స్యొని కిచ్చెనని నిర్ణయించుట తప్పు, తప్పు, తప్పు; కాస్స్యొనిఁ గుఱిచి యాపె మఱి మఱి ప్రసంగించిన నేమి, అది యాపె దొడ్డగొనమ్మ తెల్పు—నయ్యో! ఆ మృదుభాష! ఆ నిష్కపట వైఖరి, ఆ ముఖలక్షణములు, ఆ చూడ్కులు—అన్నియు నాపె నిర్మల హృదయమ్మునే ప్రకటించెడిని. ఇంకఁ గాస్స్యొని కల వరింపుఁ బల్కులు — అవి వట్టి పలవరింతల కాఁజెల్లు, మిత్రుఁడయాగుండు నట్ల సన్దిదియంపడియె. అయ్యయ్యో! అనుమాన పిశాచమ్ము కతన నాగ్రహమ్ము రవిలి తనచే నెట్టి బెట్టిదంపుఁ గృత్యమ్ములఁ జేయింప

నుండె! నేరముండినను దండనకర్త యీశ్వరుండ
కాని తానెవ్వండు? నిర్ణయమున కవలఁ బ్రియము
సందియము విడుతు నను తనప్రతిజ్ఞ యేమయ్యె?
అన్నన్నా! తాను నయోగుండు నెట్టిదుండగమ్ములు
కావింప నొడంబడియుండిరి! ఎంతటి మోసము కా
నుండె! ఇంతట నాతనిం బిలిపించి తనపంపు నివారింప
వలయు. పదంపడి దశదమానంగని తనయనుమాన
మెల్లం బాపుకొని యెప్పటియట్లు సుఖస్థితి నుండం
జెల్లు — ఇట్లని యఖిలనాథుండు నిశ్చయించికొని
అయాగునకుం బిలుపంపె.

అయ్యో! అయాగ పిశాచమ్ము మఱల నాతని
బొక్కన బోర్లగిలంద్రోయుఁగదా — బాణకను
సాగనంపి కాస్యుఁడత్తఱి నచ్చటికరుదెంచుటయు,
వెనువెంట నె యాతని వెదకికొనుచు బాణక వచ్చుట
యుంగూడ దయ్యమునకు సాయమయ్యెడి—అయ్య
యో! అఖిలుని కేమిగతి, కన్నులారఁగందురుగాక!

అన్నలారా! వెనిసుపురినుండి దశదమానాదేవి
పిన్నయ్యయు బందుగుఁడు లాదవీకుండును బయలు
వెడలి అఖిలునికడకు తేనిజాబును గొనివచ్చు వార్త
వినియున్నారుగదా! వారిరువురు నయ్యపరాహ్ణమ

యోడదిగి మంతను నింట విడిసిరి. పిన్నయ్య అథిలు నొద్ది కరుగ నెల్లండయ్యె — తన యన్న కొమరితను గాని సన్న తస్కరుని మో మాతం డెట్లు గాంచు? లాదవీకుండు మాత్రము నగరునకుం జని, ముందుగ దశదమానం గని, యాకెను బురస్కరించుకొని యథిలనాథునికడ కరిగి జేనియాజ్ఞాపత్రము నాతని చేతి కిచ్చు వాఁడు. అత్తరి నదియు నయాగ పిశాచ మ్మున కెట్లు సాయం పడియెడినో కనంగలరు. ఇంక నీ ముసలివానికి సెలవిండు! వందనములు గొండు!

[నిష్క్రమించును.]